# అయ్యలరాజు కవితా వైభవం

— డా॥ కొత్తపల్లి విశ్వేశ్వర శాస్త్రి



గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# అయ్యలరాజు కవితా వైభవం

(అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయం కావ్యంలోని
ఎన్నికైన పద్యాలకు మన్నికైన వ్యాఖ్యానం)

రచన :

డా. కొత్తపల్లి విశ్వేశ్వర శాస్త్రి



ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

[illegible]

AYYALARAJU KAVITHA VYBHAVAM

Poetic Selections from 'Ramabhyudayamu' by Ayalaraju Ramabhadrudu with Literary Commentary By Dr. Kothapalli Visweswara Sastry



యువభారతి

ప్రచురణ : 78

ప్రథమముద్రణ : డిసెంబరు 1981

ప్రతులు : 1200

ముఖపత్ర చిత్రణ : శీలా వీర్రాజు

ముద్రణ : గాయత్రి ప్రింటర్స్
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001

ముఖచిత్ర ముద్రణ :
రామా ప్రింటర్స్, హైదరాబాద్.

ప్రతులకు :
యువభారతి, 5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500 003
లేదా
యువభారతి కార్యాలయం,
ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాదు 500 001.

# యువభారతి పరిచయం



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగి నప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది సమైక్యభావాలు కుదురు కుంటాయి

యువభారతి కడచిన పదునెనిమిదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలు రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలయినంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 77 ప్రచురణలను ప్రచురించి మూడులక్షల ప్రతులకుపైగా సాధ్యమైనంత తక్కువవెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నానరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభించబడిన సాహితీమిత్ర పథకంలో 7100 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 725 మంది, భారతీభూషణులుగా 70 మందిచేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు,
డిసెంబరు 1981

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు ; యువభారతి



# అయ్యలరాజు కవితా వైభవం

## మా మాట

రామాయణం ఆదికావ్యం. ఇతిహాసం ఏకనాయకమే అయినా ఎన్నో కథలకు పట్టు. ప్రబంధయుగంలో రాయల ఆశ్రయంలో ప్రశిద్ధి వడసిన అయ్యల రాజురామభద్రుడు రామాయణాన్ని ప్రబంధంగా రూపొందించి ఒక కొత్త ప్రయోగమే చేసినాడు. ధారాశుద్ధికీ, పదసౌష్టవానికి. నన్నయ వలె నిగ్రహం ఉన్న శృంగార రసపోషణకూ, చెవులకూ మనస్సుకూ ఇంపైన శబ్దాలంకారాలకూ లక్ష్యప్రాయమైన ప్రబంధంగా రామకధను రామాభ్యుదయ ప్రబంధంగా రూపొందించినాడు.

అయ్యల రాజురామభద్రుని కవితారీతులపై పరిశోధనచేసి సిద్ధాంత గ్రంథమును సమర్పించి 1974 లో ఆంధ్రవిశ్వవిద్యాలయంవారి PhD, పట్టమును సంపాదించిన డా. కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రిగారు విజయవాడ కె.బి.ఎన్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. మా యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోవాలనే ఉత్సాహంతో “అయ్యల రాజు కవితా వైభవం” వ్రాసి మాకు ప్రచురించుకునే అవకాశం కల్పించినారు.

రామభద్రకవి రామాభ్యుదయంలోని కొన్నిమంచి పద్యాలను ఏరి వాటిలోని సొగసులను పరిచయం చేస్తూ రచన సాగించినారు డాక్టర్‌శాస్త్రి గారు. ఉడుతాభక్తితో మేం చేస్తున్న ఈ సాహిత్య ప్రచారంలో డాక్టర్‌శాస్త్రి గారి సహకారం మాకెంతో ధైర్యాన్నీ, సంతోషాన్నీ కల్గించింది. డాక్టర్ కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రిగార్కి మా కృతజ్ఞతాభివందనములను తెలియ చేస్తున్నాము.

హైదరాబాదు
డిసెంబరు, 1981.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు : యువభారతి

# ప్రస్తావన

శ్రీ కృష్ణ దేవరాయల యుగమున ఆంధ్ర సాహిత్య వనమున ప్రబంధముల పంట పండినది. ఆ ప్రబంధ ఫలములలో రామాభ్యుదయ మహా ప్రబంధమొకటి. దీనిని అయ్యలరాజు రామభద్రుఁడను కవిశేఖరుఁడు రచించెను. ఈతఁడు కృష్ణరాయల కొలువులోని అష్ట దిగ్గజ కవులలో నొక్కఁడను ప్రతీతి గలదు. కాని అందుకు జనశ్రుతి వినా ప్రబలాధార మేమియును గానరాదు.

కృష్ణరాయల ప్రేరణచే సకల కథా సారసంగ్రహమను కావ్యమును రచించితినని చెప్పికొన్న రామభద్రుఁడు నీతఁడును నొక్కఁడే యని భావించి, చాల మంది పండితులు అయ్యలరాజు రామభద్రుఁడు కృష్ణరాయల కొలువులో నున్నట్లు భ్రాంతి పడినారు. కాని ఈ యిర్వురు రామభద్రులును భిన్న వ్యక్తులు. ఈ యంశము నా పరిశోధన నిబంధమున నోపపత్తికముగా నిరూపింపబడినది.

కృష్ణరాయల యనంతర కాలమున అళియరామ రాయని మేనల్లుఁడగు గొబ్బూరి నరసరాజు నాస్థానమున అయ్యలరాజు రామభద్రుఁడున్నాఁడు. ఆ గొబ్బూరి నరసరాజునకు క్రీ॥ శ॥ 1550 ప్రాంతమున అయ్యలరాజు రామభద్రుఁడు తన రామాభ్యుదయ ప్రబంధము నంకితమిచ్చినాఁడు.

శ్రీమద్రామాయణ కథనితివృత్తముగా గ్రహించి, ప్రబంధ ఫక్కిలో నితఁడీ కావ్యమును రచించినాఁడు. ఈతని కవిత్వము ప్రౌఢమై పెద్దనాది ప్రబంధకవుల కవిత్వమున కెంత మాత్రమును దీసి పోవునది కాకున్నది. ధారాశుద్ధి కల్గి, ఘనశబ్ద స్ఫూర్తితో వర్తిల్లును, తోరంబైన రసస్థితి కలిగి, అఖిల పద్యాక్రాంతమై ఈతని ప్రబంధము వర్షారంభమును బోలియున్నది. ధ్వని చాలని కావ్యము నిరర్థకమని గ్రహించిన ఈ కవి ధ్వని సహితమును, ఉపదేశయుతమునగు నుత్తమ కావ్యమును రచించి, ప్రౌఢ ప్రబంధ కవుల లో నొక్కఁడై భద్రమగు స్థానము నధిష్ఠింపఁగల్గినాఁడు.

అయ్యలరాజు రామభద్రుని కైత అందమైనదై చెవికింపవి కొల్పు చుండును. కృతిపతియగు గొబ్బూరి నరసరాజు తన్ను కావ్య రచనకు ప్రేరేపించుచు తనతో నన్నట్లుగా రామభద్రుఁడు రచించిన ఈ క్రింది పద్యముం జూడుడు :

"క్షితిపతి యెవ్వఁడైన నగు, గీరియ సొమ్ము నృపాల కోటికిం,
గృతిపతియైన వాఁడె కృతకృత్యుఁడు, గాన నొనర్పు సప్తసం
తతులకు నెక్కుడం డ్రదు కృతి. దాశరథీద్ధ కథా సుధా చమ
త్కృత కృతి, రామభద్ర ! చెవికింపవి కొల్పు,
భవత్కవిత్వముల్"

ఈ పద్యములో కృతి పతి చెప్పినట్లే రామభద్రుఁడు రామాయణ కథను చమత్కృత కృతిగా, చెవికింపుకొల్పునట్లు రచించినాఁడు. కృతి పతి కోర్కెను కవి నూటికినూరు పాళ్ళు చెల్లించినాఁడు. ఇందాతఁడు ప్రదర్శించిన చమత్కారములు, చతురోక్తులు పాఠకుల హృదయములను బరవశింపఁజేయును. యమకాను ప్రాసాది శబ్దాలంకారము లితని చమత్కార ములకుఁ దావలములు. ఈతని చమత్కారముల కాకృష్టుఁడైన చేమకూర వేంకట కవి ప్రతి పద్య చమత్కృతి గల విజయ విలాసమును రచించినాఁడు.

అంతేగాక రామభద్రుని కవితలో శ్లేష, అచ్చ తెనుఁగు పరాకాష్ఠ నందియున్నవి. రామభద్రుఁడు చమత్కార విషయమున చేమకూర కవి కెట్లు మార్గదర్శకుఁడో, శ్లేషలో పింగళి సూరన రామరాజ భూషణులకును, అచ్చ తెనుఁగున పొన్నెగంటి తెలగన్న ప్రభృతులకును అట్లు మార్గదర్శకుఁ డైనాఁడు. కవిత్వమున శ్లేష, అచ్చ తెనుఁగు, చమత్కారము మున్నగు క్రొత్త ప్రయోగము లొనర్చిన అయ్యలరాజు రామభద్రుని ప్రబంధయుగ నవీనగుణ సనాధుఁడనవచ్చును.

కవితా ప్రౌఢిని బట్టి పెద్దనాదృష్ట దిగ్గజములను డీకొనజాలిన కవి దిగ్గజమీతఁడు. శైలివిన్యాసము, కల్పనా చమత్కృతి, (సన్నివేశకల్పన) ఔచితీనిర్వహణము, రసపోషణము, పాత్ర చిత్రణము, వర్ణనలు, అలంకార ములు, ధ్వని, చమత్కారము – మున్నగు సాహిత్యాంశము లన్నింటి యందును ఈతఁడు నిధి. రామరాజ భూషణుని తలఁదన్నినవాఁడు అయ్యల రాజు రామభద్రుఁడను నొక జనశ్రుతి గూడ కలదు. ఏదో యొక ఘట్టము నెడ మాత్రమే శ్రద్ధవహింపక రామభద్రుఁడు తన శక్తిని కావ్యమంతటను

బఱచినాఁడు. ప్రతి పద్యమునందును రసమో, ధ్వనియో, అలంకారమో, శబ్ద చిత్రణమో ఏదో ఒక చమత్కారమును జూపించుటీతని ప్రత్యేకత.

ఇన్ని యుత్తమ కవితా లక్షణములు గల యిమ్మహాకవి విశేషించి గొప్ప రామభక్తుఁడు. హృదయ పద్మాధిష్ఠిత రామభద్రుఁడనని తన గద్యలో చెప్పికొనినాఁడు. రాముని అడుగడుగునను శ్రీ మహావిష్ణువుగా భావించి అనన్య సామాన్యమగు తన రామభక్తిని ప్రకటించినాఁడు. రామభద్రుఁడు ప్రాసంగికముగా రచించిన సూక్తులు—

“బంధ మోక్షణమగుటద్భుతంబె రఘు చంద్రుని ప్రాపొకయింత గల్గినన్,” “చేరి రఘు వీరుఁ గొల్చిన వారి కెచటఁ జేటులేదు” మున్నగునవి ఆతని రామ భక్తికి నిదర్శనములు.

ఇట్టి రామభద్రుని కవిత్వమునకు లోకమునఁ బ్రచారము లేకుండుట శోచనీయము. అందఱకును దెలిసిన రామ కథ యగుటచే కాఁబోలు ఈతని ప్రబంధము పాఠకుల యుపేక్షకు గురియైనది. మరియు రామకథకు ప్రబంధత్వమును గలిగింపవలెనను చూపుగలవాఁడగుటచే, కవి అనేక మూల కథా సన్నివేశములను త్యజించుటయు, సంగ్రహించుటయు చేసి, షట్కాండల రామ కథను ఎనిమిదాశ్వాసముల ప్రబంధముగా నిర్మించినాఁడు. ప్రబంధ ఫక్కిలో నొక సంక్షేప రామాయణమును రచించినాఁడు. కథ కొఱకు గాక కవియొక్క ప్రాబంధిక నైపుణ్యమును గ్రహించుటకే రామాభ్యుదయమును జదువవలెను.

సమగ్ర సుందరముగా రామకథను సందర్శింప కుతూహలము గల పాఠకులు రంగనాథ, భాస్కర రామాయణములఁ జదువుచుండిరేగాని రామాభ్యుదయము నెవ్వరు స్పృశింపరైరి. ప్రబంధ పఠన కుతూహలులు మనువసు చరిత్రాదులను జదువుచుండిరేగాని, రామాభ్యుదయము నెవ్వరును బఠింపరైరి. ఇట్లు రామాభ్యుదయమునకు ఆ పూర్వ రామాయణములకు గాని, మనువసు చరిత్రాది ప్రబంధములకుఁ గాని వచ్చినంత ప్రతిష్ఠ రాలేదు.

అంతేగాక ఈ కావ్యమున కింత పూర్వము ఆముక్తమాల్యదా వసుచరిత్రాది ప్రబంధములకువలె నెవ్వరును వ్యాఖ్యానములు వ్రాయక పోవుటయు గూడ దీనికి ప్రచారము లేకుండుట కొక కారణమై యుండును. ఈ గ్రంథ విషయమెత్తుకొన్నపుడు కొందరు విమర్శకులు “కానక కన్న

సంతానంబుగావున ! కానక కన్న సంతానమాయె" అను పద్యము వంటి పద్యములే గ్రంథ మంతటా గలవనియు, ఈ గ్రంథ పఠనము క్లిష్టతరమైన దనియు చెప్పుట జరిగినది. ఈ గ్రంథమును వావిళ్ళ వారు తప్ప మఱెవ్వరు ప్రచురింపక పోవుటయు మఱియొక కారణము. ఇటీవల 1967లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారి పీఠికలో ప్రకటించువరకు దీని ప్రాశస్త్య మంతగా తెలియదు ఇన్ని కారణములచే రామాభ్యుదయము ప్రచారము లేక మట్టిలో పడిన మాణిక్యమువలె మరుగున పడిపోయినది.

అయ్యలరాజువారి వంశము పండిత వంశమనియు, కవి వంశమనియు ప్రసిద్ధి వహించినది. రామభద్రుని ప్రపితామహుఁడగు నయ్యలరాజు రాయ కవి బిరుదాంకితుఁడు. అతని గ్రంథములేమియు లభ్యమగుటలేదు. రామభద్రుని తాతయగు తిప్పయ్య ఒంటిమెట్టరఘువీర శతకమును రచించెను. వీరి వంశములోని వారేయగు అయ్యలభాస్కర కవులు రెట్ట మతము-అను వ్యవసాయ శాస్త్ర గ్రంథమును రచించినారు అయ్యల రాజు నారాయణా మాత్యుఁడను కవి హంసవింశతి-అను నొక కావ్యమును రచించినాఁడు. అందాతఁడు "మా యయ్యలరాజు వంశజుల నాది కవీంద్రుల సన్నుతించెదన్" అని తన వంశములోని పూర్వకవుల నెల్లర పేర్వేర వరుసన స్తుతించినాఁడు. దీనినిబట్టి అయ్యలరాజు వంశము పండిత కవి వంశమని చెప్పనొప్పును.

వీరందరిలో రామాభ్యుదయ మహా ప్రబంధ నిర్మాతయగు అయ్యల రాజు రామభద్రుఁడు సుప్రసిద్ధుఁడు. అందుచే నీతని సౌలభ్యము కొఱకై "అయ్యలరాజు"అని వ్యవహరింపనైనది. కొన్ని యెడల అయ్యలరాజు-అనియు, కొన్ని యెడల రామభద్రుఁడనియు సౌలభ్యా పేక్షతో వ్యవహరించితిని.

అయ్యలరాజు కవిత్వములోని మాధుర్యమును, అంద చందములను పంచిపెట్టుటకు ప్రయత్నించినాను. సహృదయులు స్వీకరించినచో నా కృషి సఫలమైనట్లు భావింతును. నాకు ఈ అవకాశమును గల్పించిన యువ భారతి కార్యకర్తలకు నా కృతజ్ఞతలు.

భవదీయుఁడు

కొత్తపల్లి విశ్వేశ్వర శాస్త్రి

విజయవాడ,
24-7-'81

# అయ్యలరాజు కవితా వైభవం



1] **అలహరి** యాననాంబుజమునందు జనించుటఁ జేసి మేము ము
ఖ్యులము, తదీయ నాభికమలోద్భవుఁడావిధి, మాకు నెవ్విధిన్
దెలిసిన నీడు గాఁగలడె, దిగ్గుడు మా కని గ్రేణిసేయుచుం
**బొలుతురు**, విప్రపుంగవులు, ప్రోలఁన వేదరహస్య వేదులై [1-20]

అయోధ్యాపుర వర్ణనమున అయ్యలరాజు బ్రాహ్మణుల మహిమ నుగ్గడించు పద్యమిది. "బ్రాహ్మణోఽన్యముఖమాసీత్" అను పురుష సూక్త వాక్య ప్రమాణమిట నను సంధించుకొనఁదగును. విష్ణుదేవుని ముఖ సంజాతులమగు మా కంటె నాభి సంజాతుఁడగు బ్రహ్మ తక్కువేయని పరిహాసము చేయుచు వేదవేత్తలయిన బ్రాహ్మణు లయోధ్యలో నొప్పుచున్నారని యిందలి చమత్కారము. అల్లసాని పెద్దన మను చరిత్రలో

"అచటి విప్రులు మెచ్చరఖిల విద్యాప్రౌఢి
ముది మది దప్పిన మొదటి వేల్పు" నని వ్రాసెను.

ఇట్లు సీసమున నాల్గు చరణములలో చాతుర్వర్ణ్యమును, ఎత్తు గీతిలో వేశ్యలను పెద్దన వర్ణింపగా, సీసములోని మొదటి చరణపు ఛాయలో బ్రాహ్మణులను వర్ణించు పై పద్యమును అయ్యలరాజు చెప్పినాడు.

పుర వర్ణనమున నిక్కవి చాతుర్వర్ణ్యములో వైశ్యులను చతురంగబలమున రథములను వర్ణింపకుండుటయు గమనింపఁదగును. వేశ్యలను ఇంచుమించు పది పద్యములలోను, పుష్పలావికలను రెండు పద్యములలోను వర్ణించిన యిక్కవి శృంగార రసజ్ఞ శేఖరుఁడని తోచును.

2] పొలుపొందం బురి సింహమధ్యలు, ధనుర్భ్రూ విభ్రమల్, మీననే
త్రలు కుంభ స్తన పాళికల్, మకర చిత్రశ్రీల సద్గండ భా
గలునై, మించిన వారకన్యలు, త్రిలోక ఖ్యాత సౌభాగ్య రా
సులుదారై, యతులాకృతి న్మెఱయుటల్, చోద్యంబుగాదే మహిన్.
[1-11]

అయోధ్యా నగరంలోని వారకన్యలు సింహమధ్యలు, (సింహము నడుము వంటి నడుము కలవారు) ధనుర్భ్రూ విభ్రమలు, (ధనుస్సుల వంటి కను బొమలు గలవారు) మీన నేత్రలు, కుంభ స్తనులు, మకర చిత్రశ్రీల సద్గండ భాగలు (మకర రూప చిత్రములు—మకరికా పత్ర రచనలు చెక్కిళ్ళయందు గల వారు)—ఇట్లు త్రిలోక ఖ్యాత సౌభాగ్యరాసులు అయినను అతులాకృతితో ప్రకా శించుట చిత్రముగదా! సాటిలేని రూపముగల యవ్వేశ్యలు సింహాది రాసులతో బోలికలుండియును తులారాశితో పోలికలేనివారై ప్రసిద్ధి గాంచుట చిత్రముగదా! అని తాత్పర్యము.

మేషాది ద్వాదశ రాసులలోఁ గొన్నింటి నుపమానములుగా గ్రహించి శ్లేషతో కవి యీ పద్యమున చమత్కరించినాఁడు రాసుల శబ్దములతో స్త్రీలను అను సంధించును. సాటిలేని వారని చెప్పుటకు 'తులారాశిని'-అతులాకృతి-అను నమానమున రమ్యముగా గ్రహించెను.

3] ధనులగు కోడెగాండ్రకును దంగెటి జున్నులు, కోరి నిండు జ
వ్వనమునఁ జేరు పేద తెరువర్లకు నందని మ్రాని పండ్లు డా
సిన గతిదక్కి యేరికినిఁ జిక్కని చక్కని మాయ లేళ్ళు, మో
హన మధురాధర స్తన దృగం చల భాసినులవ్విలాసినుల్. [1-24]

ఆ విలాసినులు, ధనవంతులైన కోడె గాండ్రకు తంగెటి జున్నులు, పేద విటులకు అందని మ్రాని పండ్లు; చేరినట్లే చేరి యెవ్వరికిని చిక్కని మాయ లేళ్ళు-అనఁదగినట్లు మోహన మధురాధరలై, రమణీయ స్తన సంపన్నలై, చంచల దృగంచలలై విహరించుచుందురు.

తంగేటి జున్నులు - అధరములు
అందని మ్రాని పండ్లు - స్తనములు
మాయలేళ్ళు - దృగంచలములు.

మనోహరమైన యిందలి రూపకములు క్రమాలంకార బద్ధములై యొప్పుచున్నవి. ఈ పద్యము కవి యొక్క సౌందర్యదిదృక్షను, అలంకార ప్రీతిని, వర్ణనా నైపుణ్యమును బ్రస్ఫుట మొనర్చుచున్నది,

4] పుష్ప లావికా వర్ణనము :-

బాల ! నీమోమున వ్రేలకయున్నె, యీ
 పద్మముల్ దునిమిన పాతకంబు
కలకంఠి ! నీ కన్నుఁగవఁగప్ప కున్నే, యో
 కువలయ సంతతి కోయు నఘము
కొమ్మ ! నీ మెడఁ జుట్టు కొనకున్నె, మీ పోక
 పూఁ బొత్తి చిదిమిన భూరి కలుష
మెలనాగ ! నీ పదంబులఁ జెన్గకున్నె, యీ
 పల్లవంబులు గిల్లు పాప మొకట
నని, విటాలి, నిజాంగ మోహనత లెంచి,
 మరులు కొని, త్రస్తరులు వల్కి, విరులు కొనగ
మొలక నవ్వుల, తళుకులు దొలకఁ గలిగి
 పుష్ప లావికలప్పురిఁ బొల్తు రెపుడు [1-30]

విటులు పుష్పలావికల అంగ సౌందర్యమును వ్యంగ్యముగా పొగడుచు మోహావేశముతో సరసములాడుచు పూలు కొనుచున్నారు. అపుడా పూలమ్ము పడుచులు వారి సరసములకు మొలకనగవులతో కులుకు చుందురట.

ఈ పద్యమున ఉపమాలంకారధ్వని మనోజ్ఞముగా నున్నది. ఈ పద్మముల్ దునిమిన పాతకము నీ ముఖమున వ్రేలకుండునా-అనుట వలన అమె ముఖము పద్మమువలె నున్నదని ధ్వని. అట్లే కన్నులు కలువలవలె నున్నవని,

మెడ పోక పూఁబొత్తివలె నున్నదని, పదములు విగుళ్ళవలె నున్నవని ఉప మాలంకారము ప్రతీయ మాన మగుచున్నది.

పావము ముఖమున వ్రేలాడుట, కంఠమునఁ జుట్టుకొనుట-అని జను లాడుకొను మాటలను (జాతీయములను) కవి యిందు సార్ధకముగా ప్రయో గించెను.

5] తలఁప నుదాహరణాకృతిఁ
గళికల రంజిల్లి, సరస కవి కావ్యమునుం
బలె, నెడల మత్త కోకిల
కలన న్మధువేళ, వనని కాయం బమరెన్. [1-53]

అయ్యలరాజు ప్రథమాశ్వాసమున వసంతర్తు వర్ణన మొనర్చి ప్రబంధ త్వమును బాదుకొల్పెను. ఈ వసంతర్తువును దశరథుఁడు పత్నులతో విహరించు టకు ఉద్దీపన విభావముగా వర్ణించెను. దశరథుఁడు భార్యలతో వన విహారమొన ర్చుట, రాణులు పుష్పాప చయమొనర్చుట జలక్రీడ సల్పుట-మొదలగువానిని ప్రథమాశ్వాసమున వర్ణించినాడు.

మూలమున దశరథుఁడు భార్యలతో వన విహారాదులొనర్చినట్లు లేదు. సంతానము లేక కుమిలిపోవు వృద్ధుఁడగు దశరథుఁడు మనకు రామాయణ కావ్య మునఁ బరిచితుఁడగును. కాని రామభద్రుడు ముచ్చటగా దశరథుని యౌవనమును, విలాస విహారములను వర్ణించెను. వృద్ధుడగు దశరథుని విహారములను వర్ణించుట అనౌచిత్యమని విమర్శకు లాక్షేపింతురు. దశరథుడు అరువదివేల సంవత్సరములు రాజ్యమేలెను. యౌవన వార్ధక్యములు ఆ నాటి ఆయుర్దాయమునుబట్టి నిర్ణయింప వలెను. ఈ సందర్భమును దశరథుని యౌవనమునకు సంబంధించినదిగా గుర్తింప వలెను. రామాభ్యుదయమున దశరథుని యౌవన కాలము నుండి కథ ప్రారంభ మైనదని మనము గ్రహింపవలెను.

పై పద్యమున వసంతర్తువున వన శోభను గూర్చి కవి చెప్పెను. వసంతమున ఉదాహరణ కావ్యమువలె కళికలతో నొప్పి, ఆ వన సముదాయము

సత్కవి కావ్యమువలె మత్త కోకిల సంపన్నమైనది. ఉదాహరణ కావ్యములో కళికలుండును ఇచట వనములో మొగ్గలున్నవి. సరస కవి కావ్యములో నెడ నెడ మత్త కోకిల (పద్యము) లుండును. ఇట్లు కళికలతో ఉదాహరణ కావ్యమువలెను, మత్త కోకిలలతో సరస కవి కావ్యమువలెను వసంతవేళ వన సమూహమొప్పెనని కవి శ్లేషాలంకారములో సొగసుగా కావ్య ప్రసక్తి యొనర్చినాడు.

ఏదో ఒక సందర్భము కల్పించుకొని కావ్య మధ్యమున నిక్కవి సాహిత్య ప్రసక్తి యొనర్చు చుండును. ఉదాహరణ ప్రబంధము దేశి కావ్యములోనిది. మార్గ కవిత్వ మీతడు వ్రాసినను ఈతనికి దేశి కవిత యందభిమానమున్నట్లు ఈ పద్యమువలవఁదెల్లమగును.

> లాల సమందమంద గతులన్ ఘలుఘల్లని మ్రోయనందియల్
> వ్రేలు నొయారి క్రొమ్ముడులు, వెన్నుకెలంకులు, వే, ముహుర్ముహు
> ర్లీల నటింపఁ, గౌనులు చలింపఁగ, ఘర్మ కణాల కాలిక
> శ్రీలలరింప, సక్కొలను చేరిరి, రాజమరాళగామినుల్ (1-88)

అయ్యలరాజు రామభద్రుడు శయ్యయందతి ప్రవీణుడు. రీతి మార్గము సందతడు సిద్ధహస్తుడు, 'విశిష్ట పదరచనారీతిః' అని నిర్వచనము. ఏ సందర్భమున నెట్టి పదజాలమును పయోగింపవలెనో తెలిసిన మేటి రామభద్రుఁడు. జల క్రీడా విహారమునకయి కొలను చేరు రాజమరాళగామినుల మందమందగమనములను, చలించు క్రొమ్ముడులు, వెన్నుకెలంకులు, నడుములు – నుదుటి చెమట బిందువులను - అతి మనోజ్ఞముగా – వారి రూపురేఖలనుకన్నులకుఁ గట్టినట్లుగా, మృదుమధురమైన పదజాలమును పయోగించి, మాధుర్య గుణముతో వైదర్భి రీతిలో రచించిన కవి నైపుణ్యము ప్రశంసార్హము ఈ పద్యము ద్రాక్షా పాకమున నొప్పుచున్నది.

ఈతని రచన ప్రౌఢమని చాలమంది భయపడుదురు. కాని యిట్టి సరళ సుకుమారమైన పద్యము లెన్నియోయాతని రచనయందు గలవు. ఈతని ప్రౌఢశైలికి క్రింది పద్యమొక యుదాహరణము.

సింహనఖాంకురచ్ఛిన్న వారణకుంభ
జనితముక్తాఫలశర్కరిలము
సమద సూకర పరస్పర భీకరాఘాత
శిథిల దంష్ట్రా చూర్ణసిక తిలంబు
గంధసింధురఘటాకట కటాహస్రవ
ద్బంధుర దానాంబు పంకిలంబు
దవగంధవహ బంధు దహ్యమానానేక
కౌశికాగురుధూప గంధిలంబు
పృథుల షడ్జ స్వరోద్గీత భిల్ల పల్ల
వాధరగీతికా కర్ణనాతిభీతి
పరవశాత్మ పటీర కోటర కుటీర
లీనఫణియగు నక్కాన కాననయ్యె (2-25)

దశరథుడు వేటకేగినపుడు కవి అరణ్య భీకరత్వమును వర్ణించిన పద్యమిది. కొలువు దీరియున్న దశరథుని కడకు చెంచులు వచ్చివేటనేగ సూచింతురు. మృగయా వినోదమున నున్న దశరథుడు గజభ్రాంతిచే మునిబాలకుని వధించుటయు. వాని తల్లిదండ్రులచే శపింపబడుటయు ఈ సందర్భమున కవి వివరించెను. వాల్మీకి రామాయణమునసీయంశము అయోధ్యాకాండలో రామాదులు వనవాసమునకేగినపుడు దుఃఖించుచు దశరథుడు కౌసల్యకు పూర్వకథా ప్రకటనమొనర్చి, తాను ముని దంపతులచే శప్తుడ నైతినని చెప్పును.

కాని రామాభ్యుదయమున బాలకాండకథలోనే కాలక్రమ పద్ధతిలో నీ సంఘటన జరిగినట్లు రామభద్రుడు మార్చినాడు. ఈ మార్పుచే దశరథుని వేటను విపులముగా వర్ణించుటకు కవికి అవకాశము కల్గినది. మదకరి భ్రాంతిచే మునికుమారుని చంపునాటికి మూలమున దశరథునకు వివాహమే కాలేదు. రామాభ్యుదయమున వివాహితుడని గ్రహింపనగును. ద్వితీయాశ్వాసముననున్న యీ అంశమును బట్టి ప్రథమాశ్వాస కథాకాలము నాటికి దశరథుడు యౌవనమున నున్నాడని గ్రహింపగలము. అందుచే దశరథుని యౌవనవిహారములను ప్రథమాశ్వాసమున వర్ణించుట సమంజసమేయగును.

భావము;- సింహముల గోళ్ళచే చీలిన యేనుగుల కుంభస్థలములనుండి రాలిన ముత్యాలతో నేల సందు లేకుండనున్నది. మదించిన వరాహములు ఒకదానితోనొకటి పోరాడునపుడు విఱిగిన వానికోఱలు నుగ్గునుగ్గయి పడియున్నవి. మదపుటేనుగులు కుంభస్థలముల నుండి కురిసిన మదజలధారలతో తడిసి మట్టి పెనుబురదగానైనది. దావాగ్ని వాయువుతోడ్పాటుతో కాల్చివైచుచుండగా తప్పించుకుపోలేని గ్రుడ్లగూబలు కాలిపోగా దుర్గంధభూయిష్టమై యున్నది. భిల్లాంగనలు షడ్జస్వరమున పాటలు పాడుచుండగా మిక్కిలి భయపడిన పాములు మంచిగంధపు చెట్టుతొఱ్ఱలలో దాగుకొనుచున్నవి. అట్టి భయంకరమైన అడవిని దశరథాదులు గాంచినారు.

ఈ పద్యము రామభద్రుని సంస్కృత సమాసఘటనమునకు, శయ్యానైగనిగ్యమునకు, వర్ణనా కౌశలమునకును ప్రతీయమానముగా నున్నది. సీస పద్యమున ఏపాదమున కాపాదము ఏక సమాసఘటితము, లయబద్ధమునై, రచన చతురస్రముగా సాగినది. గీతపద్య మంతయు నించుమించుగ నొకసమాసములోనున్నది. అందుచేత సీసమునకును గీతమునకును ఒక ప్రతియేర్పడినది. దీర్ఘసమాసయుతమగు నిప్పద్యము కానన భీకరత్వ నిబిడత్వములను సూచింప సమర్థమైయున్నది.

ఈ పద్య రచనచే రామభద్రుడు ఆక్షేపణకు గురియైనట్లు ఒక ఐతిహ్యముగలదు, "గానమునకు పాములాకృష్టములగును గాని, భయపడునా" అని రామరాజభూషణుడు అయ్యల రాజు నాక్షేపించెనట. అపుడయ్యలరాజు షడ్జస్వర వైశిష్ట్యమును విశదీకరించి- (షడ్జస్వరమునకు - నెమిళ్ళకంఠధ్వనులని - పాములు భయపడుట సహజమని చెప్పి) రామరాజ భూషణుని నిరుత్తరునిగావించెనుట. నాటినుండి రామరాజ భూషణుని తలదన్నినవాడు రామభద్రుడు-అనునొక కథ ప్రచారములోనున్నది దీనినాధారముగాఁజేసికొని అప్పకవి పూర్వకవి స్తుతిలో అయ్యలరాజు రామభద్రునుద్దేశించి

"రామరాజ విభూషణ రత్నఖచిత
చారుమస్త కలాపాదిహారి వాక్య

గౌరవము పెక్కుభంగుల గణనచేసి"
పిదప నితరాంధ్ర కవులకుఁ బ్రియము పల్కి"
అని వ్రాక్రుచ్చినాఁడు

కథాంశముజెప్పునప్పుడు కథాకథన పాత్రపోషణాదులపై దృష్టిని కేంద్రీకరించు కవులు శైలీ విషయమునఁ బలువోకలు వోవుట కష్టమైన పని. వర్ణనా సందర్భమున విజృంభించి కవులు తమ శైలీవిన్యాస వైవిధ్యమును బ్రదర్శింతురు. దశరథుడు వేటకేగినపుడు కవి యొనర్చిన యీ అటవీ వర్ణనము అరణ్య భీకరత్వమును సూచించుచు మనోజ్ఞమగు శైలిలోఁ గూర్పఁ బడినది. ఇందే పాదమున కాపాదమునొక దీర్ఘసమాసముగా సంఘటించి అరణ్య భీకరత్వమును, నిబిడత్వమును కవి సూచించినాడు. ప్రతిపాద సమతా పాదనమైన యీ సీస పద్యము లయ బద్ధమై శ్రావ్యమైయొప్పు చున్నది.

ఈ పద్యమున నయ్యలరాజొనర్చిన సమాసఘటనము పాండురంగ విభుని పదగుంభనమునకుద్దిగానున్నది. ఈ పద్యమును జదివిన వెంటనే తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యములోని

'కఠిన కంఠీర వాక్షత నఖక్షత జర
త్కరి శిరశ్శుక్తి శార్కరిలతలము' అను అటవీ వర్ణన పద్యముజ్ఞప్తికి వచ్చును. ఇమ్మహాకవు లిర్వురిలో నెవ్వరెవ్వరి ననుకరించిరో చెప్పఁజాలము.

రామభద్రుని కల్పనా నైపుణీ రామరాజభూషణు నంతటి వానిని మురిపించెననియు, ఈతడు రచించిన "మోహోపదేశత మో ముద్రితములైన కను
దమ్ముల హిమాంబులునుపరాదు"
అనుపద్యమును మెచ్చుకొని తన వసుచరిత్రలో వాడు కొనెనని జన శ్రుతి ఇందలి యాథార్థ్యమును నిర్ణయించుట కష్టము.

ఏక సమానఘటితములును, ప్రతి పాదసమతా పాదకములును నగునిట్టి సీస పద్యములు రామాభ్యుదయమ సం దెన్నియో గలవు. మఱి రెండు పద్యము లిటను దాహరింపబడుచున్నవి.

8. కల్లోల డోలా సముల్లోలలీలాస
రాళమరాళ వాచాల ఝురము
లుంగలవంగానుషంగి భృంగీజాత
సంగీత భంగీతరంగితంబు
వాతపోతోద్ధూత వాసనావళలస
న్మల్లికా వల్లికా వేల్లనంబు
కిన్నరీ ఖేచరీ పన్నగీ జనగీత
సుఖద నానాగాన ముఖర శిఖర

మదె కనుగొంటె, రాకామృగాంక వదన !
మదన విశిఖాయ మానాసమాన కుసుమ
సముదయాసార సౌరభోచ్ఛ్వసిత దళది
శాచలంబగు చిత్రకూటాచలంబు (5-62)

రాముఁడు సీతకు చిత్రకూటాచలమును జూపి వర్ణించి చెప్పుచున్నాడు. ఇందు కవి వాడిన వృత్త్యనుప్రాసాలంకారము వీనుల విందొనర్చు చున్నది. ఇందలి శైలీ విన్యాసమతి మనోహరము. శ్రీనాథుని శైలికి రామరాజభూషణుని శైలిని జోడించినంత యందముగా నున్నది. నాతి సులభమును నాతి కఠినమునునగు పదజాలముతో గూడి పాంచాలీ రీతిలో కదళీ పాకమున నొప్పుచున్నది. మరియు కన్నుల పండు వొనర్చు దృశ్యములతో, వీనుల విందొనర్చు సంగీత ధ్వనులతో, నాసికాతర్పణ మొనర్చు పుష్ప సౌరభముల తోను నొప్పుచున్నట్లు కన్నులకుఁ గట్టినట్లుగా చిత్రకూటాచల శోభను వర్ణించిన కవి కౌశలము ప్రశంసార్హము.

9. తాపసోత్తమదత్త దర్భ చర్వణమత్త
కుంభత్కురంగికా డింభకంబు
వాచంయమేశ్వరాధ్వర నిరంతరహోమ
ధూమసంఛన్న పాథోద పథము
మౌనిచక్రేశ కుమార చక్రానీత
ఫలమూల కళ సమిత్పల్లవంబు

సంయమికన్యకాజన కృతాఖిల భూజ
వల్లికా పరిణయ వైభవంబు

పర్ణశాల తరుస్కంధబద్ధ లోహ
పంజరారూఢ కీర సంపఠ్య మాన
భాసురామ్నాయ శాస్త్రోక్తి హాసరవము
కలశజాశ్రమ పదము రాఘవులు గనిరి. (5-112)

సీతా రామ లక్ష్మణులు గాంచిన అగస్త్యాశ్రమమును కవి ఆలోచిత వాతావరణముట్టి పడునట్లు, అతి సహజ సుందరముగా కనులకుఁగట్టినట్లు చిత్రించినాడు. స్వభావోక్త్యలంకారముతో నుట్టిపడుచున్నది వర్ణనము. ఇదియును నాతి సులభము నాతికఠినమునై కదళీపాకమున పాంచాలీ రీతిలో నొప్పుచున్నది.

ఇట్లు దీర్ఘ సంస్కృత సమాసములను వాడుటే కాక యెడ నెడ నిక్కవి కేవల సంస్కృత పదములతో పద్య రచన యొనర్చినాడు.

10. పాక విధానం చిత్రం,
శాకరుచిం కింవదామి, సమతానాస్త్య
స్తోక దధి ఘృతానాం నా
నా కల్పిత ఫల రసాయనానా, మనుచున్. (3-21)

దశరథుని యాగమునకు వచ్చిన విప్రులు భోజనాలు చేయుచు నిట్లను కొనిరఁట. విప్రుల పలుకులెంతో సరసముగా నున్నవి. భోజన ప్రియులగు బ్రాహ్మణులు ఆయా శాకపాకములను మెచ్చుకొనుచు తృప్తిఁగా భుజించిరి కాఁబోలు. ఇట్టి పద్యము లాతని సంస్కృత భాషాభిమానమును, పాండిత్యమును వ్యక్త మొనర్చును.

సురలు వైకుంఠమునకేగి శ్రీ మహా విష్ణువును ప్రార్థించునపుడీతడు వ్రాసిన యీ క్రింది పద్యములం జూడుడు.

11. హరయే, జిత మరుదరయే,
తరయే భవ వారిధేశ్చ, ధన్యజనానాం
సురతరవే, స్మరగురవే,
స్థిర వేదమయాయ, దేవ దేవాయనమః (3-56)

12. స్రగ్ధర. శ్రీమన్నేత్రాంచలాయ శ్రితభరణ నమస్సింధు
కన్యావరాయ క్షేమారామాయ మాయాకితవదితి భవక్లేశ
కృత్త్రాభవాయ శ్యామాయఝాపతేః తేజటి హృదయ
గృహస్థః ప్రసీద ప్రసీద స్వామిన్మాం పాహి పాహీశ్వర
వరదహరే శార్ఙ్గపాణేకృపాళో (3-57)

దైవస్తోత్రములుగాన సంస్కృతమునఁ జేయఁబడినవి. తెలుగు ఛంద స్సులోకంద పద్యముగా మొదట రచించుట విశేషము. రెండవ పద్యము సంస్కృత ఛందమున స్రగ్ధరావృత్తమున కూర్పఁబడినది. ఇది యీతని సంస్కృత పాండిత్యద్యోతకము.

లోకజ్ఞుడగు నిమ్మహాకవి ఆయా సందర్భములలో కొన్ని సంస్కృత లోకోక్తులను గూడ వాడినాఁడు. ఉదా॥ 1. యత్రధూమ స్తత్రాగ్నిః, 2. నదైవం కేశవాత్పరమ్, 3. 'కర్తా భోక్తాజనార్దన' యటంచు శ్రుతుల్ చాటన్ వినవే, 4. క్రియా కేవల ముత్తరమ్. 5. స్త్రీ రత్నందుష్కులాదపి, 6. యతో ధర్మస్తతోజయ' యనన్వినవే. ఇట్టి వింకెన్నియో గలవు. వీనిలో శాస్త్ర వైదుష్యము గూడ గలదు.

13. అర్తుల నీవ వేర్తు వరయంగఁద్రిమూర్తి విలాసవర్తి, పెన్
గర్తవు భరవుం దలఁపఁగా బరిహర్తవునీవ, నీవ చి
న్మూర్తివి, నీ వపోషణ చణుండవు, కర్తుమకర్తు మన్యథా
కర్తు ముదార శక్తియు జగంబుల నీవకదా గదాధరా!
(3-62)

సురలు శ్రీమన్నారాయణునిట్లు ప్రార్థించుచున్నారు వారి స్తోత్రము ద్వారా సృష్టి స్థితిలయ కారుడగు పరమేశ్వరు డొక్కడే శ్రీ మహా

విష్ణువు అని ఏకేశ్వరోపాసనమును కవి తెల్పుచున్నాడు. ఈ పద్యము లోని అను ప్రాసములు శ్రవః పేయములుగానున్నవి. "కర్తు మకర్తు మన్యథా కర్తు ముదార శక్తి"యు జగంబుల నీవకదా - అనుచో నింపు సంస్కృత పదానుకరణము శ్రావ్యముగా నున్నది

అనుకరణములేక సంస్కృత శబ్దము ప్రయోగింపవచ్చునని యొకా నొక, కవి చెప్పెను. "వినానుకరణం కశ్చిదాద్య శబ్దం ప్రచక్షతే"అని సూత్రీకరించి "కర్తు మకర్తు మన్యథా కర్తు ముదార శక్తిని" ఇవి మొదలైనవి- అని అధర్వణ కారి కావళి సంజ్ఞా పరిచ్ఛేదములో నుదాహరింపఁబడినది.

ఆంధ్ర ప్రబంధమునందుఁ గేవల సంస్కృత శబ్దము ప్రయోగింప వచ్చును. ''ప్రబంధే కేవలాద్యస్య ప్రయోగస్యన దోషకృత్" అని సూత్రీకరించి ''హరయే జితమరుదరయే....—దేవదేవాయనమః" ఇవి మొదలగు ప్రయోగంబులనేకంబులు గలవని–రామాభ్యుదయ పద్యము అధ్వరణ కారి కావళి సంజ్ఞా పరిచ్ఛేదములో నుదాహరింపఁబడినది.

దీనినిబట్టి అయ్యల రాజు రామభద్రుడు గొప్ప లక్షణ గ్రంధ కర్తలలోఁ బ్రచారమున్న కవి యని స్పష్టమగును.

సంస్కృతాంధ్రము రెండును సమముగా నడుపగల సవ్యసాచి అయ్యలరాజు రామభద్రుఁడు. ఈతని తెనుఁగు రచనఁ బరికింతము.

14. తెల్లని దీవి తమ్మినెలదేటి వలెన్, దగు నొక్కబాగరిన్,,
నల్లనివాని, లచ్చిరతనంబును మచ్చయెదం దలిర్ప రం
జిల్లెడు వానిఁ, జుట్టలుగుఁ జిందమునందినవానిఁ, బెంపు సొం
పెల్లెడ గల్గు, పాల్కడలి యిల్లట వల్గుని,
గాంచిరయ్యెడన్. (3-44)

వైకుంఠమునకేగిన సురలు శ్రీమన్నారాయణుని గాంచిరని కవి ఈ పద్యమును అచ్చతెనుఁగున రచించినాఁడు- ఇంతకు ముందు నాచన సోమన ఒండు రెండు అచ్చ తెనుఁగు పద్యములను రచించెనేమో గాని, అచ్చ

తెనుఁగు రచనకు మిగుల ప్రాచుర్యము కల్పించినాఁడు అయ్యలరాజు మాత్రమే. ఈతని ప్రభావముచేతనే పొన్నెగంటి తెలగన్నయును, తదను యాయులును అచ్చ తెనుఁగు కబ్బములు రచించినారు. కాని అయ్యల రాజు రచనలో నున్న వైశద్యము మిగిలినవారి రచనలలోఁ గానరాదు. వారి కావ్యముల భాష పద్ధతి ప్రకారము అచ్చ తెనుగు కావచ్చును. కాని చాలా భాగము కృతకము. ఈతని అచ్చ తెనుఁగు రచన స్వభావసిద్ధముగా నుండును; రమ్యముగా నుండును. ఈతని అచ్చ తెనుఁగు పద్యముల సొగసు ముద్దులు మూటగట్టుచు, ముగ్ధ మనోహరమై శ్రవణపేయముగా నుండును. తరువాతి పద్యముంజూడుడు.

15. తొవ తమ్మి నిఁదు న్దోయి మించినవాఁడు
జాళువామిసిమి పచ్చడమువాఁడు
కలిమి చేడియఁ బంటవలతి నేలినవాఁడు పుడమి
వేల్పులకుఁ జేపడనివాఁడు
తొంటి జేజే మూకఁదూలింపగలవాఁడు
ముజ్జగంబుల చూలు బొడ్డువాఁడు

సొగసి నవ్వక నవ్వు నెమ్మొగమువాఁడు
కలుములీనెడు తళుకుఁ గ్రేగంటి వాఁడు
వేద సాదల బ్రదికించు పెంపు వాఁడు
పాలమున్నీటిలోనఁ జూపట్టె నపుడు (3-45)

ఇట్లే కవి భక్తి భావమున పోతనగారివలె పరవశుఁడై రచించును. ఇట్టి పద్యము లొండు రెండు కూచి మంచి తిమ్మకవి నీలా సుందరీ పరిణయ మునఁ గనిపించును.

అచ్చ తెనుఁగు రచనకు-విశ్వామిత్రుడు దశరధుని కడకేగె నను సందర్భములోని క్రింది పద్యముంజూడుడు.

16. కడలి మొలనూలి నవలా
యొడయని,ఁ బది తేఁపలయ్య, నొయ్యన చేరెన్,

జడదారి మేటి రావం
గడంపు బాలుండు, కోరికల్ చేకూలన్. (4-3)

పద్యము సుగమము. ఇట్లే కవి వాడు తెలుఁగు మలుగులు సుల భముగా నర్థమగునవై యున్నవి. ఈతని తెలుఁగు మలుగులకు కొన్ని మచ్చులు.

1. వినుసికదేవర = వ్యోమకేశుడు = శివుడు
2. పలుకుటిల్లాలి నెమ్మోము బాపనయ్య = బ్రహ్మ.
3. చుక్కమగవానియయ్య = తారాపతి తండ్రి = సముద్రుడు.
4. వినుమానికంపు జోదు = ద్యుమణి = సూర్యుడు
5. తొలి వేల్పులు = పూర్వ దేవతలు = రాక్షసులు
6. కడలి మొల నూలి నవల = భూదేవి.
7. పది తేరులయ్య = దశరథుడు.
8. జడదారిమేటి = ముని శ్రేష్ఠుడు.

ఈతడు వాడిన జాతీయములును, తెలుఁగు లోకోక్తులును తెనుఁగుఁ దనముట్టి పడుచు నీతని లోకజ్ఞతను జాటుచున్నవి. కొన్ని మచ్చులు దిగువనీయబడుచున్నవి.

1. ప్రొద్దు పొడుచు టెఱుగక
2. కడుపు చల్లగదలక యుండనే.
3. కొలవిం దలగోకి కొనంగదగునే
4. బ్రతుకు తెరువిది నీకు
5. పండుగాని కాయగాదు.
6. వాని పుట్టి ముంచె గట్టులన్
7. నువ్వుగింజ వ్రేయనుంజోటు లేకుండ

8. త్రాడుదన్ను వారల తలఁదన్ను వారలదిరా

9. నక్కఁగన్న వాఁడెల్లను వేట కాడనుట

10 ధర్మము చాలు కుక్కఁబట్టుమనుట

17. నీరవి మండలంబయిన నింగియు, దక్షిణలేని యాగ, మం
భోరుహ శూన్యమైన జలమున్, ధ్వని చాలని
కావ్యమున్ సదా
చారము, బాయు బ్రాహ్మ్యము, నశాంతి తపంబు,
నపత్యదూర సం
సారము, నొక్కతీరని విచారముసేయు, విభుండువే
మఱున్ (2-67)

సూర్యమండలములేని ఆకాశమును, దక్షిణలేని యాగమును, పద్మములు లేని నీరును, ధ్వని చాలని కావ్యమును, సదాచారమును వీడిన బ్రాహ్మణత్వమును, శాంతి లేని తపమును, సంతానములేని సంసారమును ఒకే విధముగదా! అని దశరథుడు పలుమార్లు విచారించుచుండును.

సంతానములేని తన సంసారమును దశరథుడు నిరర్థకవస్తుజాలములో చేర్చి విచారించినాఁడు. ఆ నిరర్థకవస్తుజాతములో ధ్వని చాలని కావ్యమునుగూడ కవి చేర్చుట గమనింపదగినది. కావ్యమున రసధ్వని, ప్రధానమను అంశము నాకళించుకొని, యీతడు కావ్యనిర్మాణము చేసెను. ధ్వని లేని కావ్యములన్న నీతనికి చులకన. అందుచే నీతడు తన ప్రబంధమున ధ్వనికే ప్రాధాన్యమిచ్చెను. ఒక్కొకప్పుడది శ్లేషరూపముగా గూడ గలుగవచ్చును.

18. వీరలానతిచ్చినట్టి వింతవింటివే కదా?
యూరుఁ గీరుఁ జేరఁ డంట, యుండునంట కానలో,
బేరు ఋష్యశృంగుఁ డంట, పిల్వఁ బంపు, పంపగా
నా ఋషీశ్వరుండు వచ్చెనా, ఫలించుఁ గర్జము

సంతాన కాంక్షచే కుందుచున్న దశరథునకు వసిష్ఠ వామదేవాది మహర్షులు పుత్రకామేష్టి చేయఁ బ్రోత్సహింతురు. ఆ యాగమొనర్చుటకు ఋష్యశృంగుడను మునిని రప్పింపవలెనని వారు చెప్పగా దశరథుడుఁ త్సాహముతో మంత్రివైపు దిఁగి యిట్లు చెప్పినాఁడు.

దశరథుని ఆనందోత్సాహములకుఁ దగినట్లుగా నిట ఉత్సాహవృత్త స్వీకారము సందర్భోచితమై, కవి యొక్క వృత్తౌచిత్య పరిజ్ఞానమును దెలుపు చున్నది. ప్రయత్నముచేసి యెట్లైన మునిని రప్పింపవలెనని తరువాతి ఉత్సాహవృత్తములోఁ గూడ దశరథుడీ సందర్భమున మంత్రి నాజ్ఞాపించును.

పాత్రల మూర్తులను గన్నులకు గట్టినట్లు చిత్రించుట రామభద్రుని సొమ్ము. పర్ణశాలా ప్రాంగణముననున్న ఋష్యశృంగుని జూచి వేశ్యలు తమలో నీ క్రింది విధమున భావించిరి.

19. ఎంతగడ్డంబైన, వింత లేదొసపరి,
తీరుగా బవిరి దిద్దింపవచ్చు
నొసలి వేలిమి బొట్టు మసిమీద, మృగనాభి
తిలకంబు బటువుగా దీర్పవచ్చు
ధవళంబులైన దంతములపై, వీడెంపుఁ
గెంపు పెందళుకు, గల్పింపవచ్చుఁ
బులి తోలు విడిపించి, జిలుగుదుప్పటి రం
గుల వల్లెవాటు, మేకొలుపవచ్చుఁ

గోఁ అసిగవేయు చోటనే, కొమ్ము పుట్టి
చెఱిచినదిగాని యెంతైనఁ జేయవచ్చు;
గడపట, భుజంగ వేషము వడసినప్పు
డుం డుఁబో,గండు మీటి యిమ్మిండ తపసి (2-110)

ఋష్యశృంగఘట్టమునిక్కవి ప్రబంధపాకములో నతి మనోజ్ఞముగాఁ జిత్రించినాఁడు. ఆర్ష వాతావరణమును విస్మరించి, వేశ్యల టక్కుటెక్కు

లను హద్దుమీరునట్లే వర్ణించినాఁడు. వారి వనవిహార వర్ణనమును గన్నుల పండువుగా నొనర్చినాఁడు. ఈ పద్యమున ఋష్యశృంగుని మూర్తిచిత్రణ మతి సహజముగా నొనర్పఁబడినది.

వేశ్యలు ఋష్యశృంగుని రూపమునుగాంచి భుజంగ వేషమునకు మార్చుకొనుటకు వీలుగానున్నదని తలచుచు "కోఁఅసిగ కొసగానున్నసిగ) వేయు చోటనే కొమ్ము పుట్టి చెఱిచినదిగాని యెంతైనఁ జేయవచ్చు"నని పల్కుచోట చక్కని సున్నితమైన హాస్యరసమును కవి పోషించినాఁడు. అతనిని గూర్చి వేశ్యలు వేళాకోళముగా ననుకొను యీ మాటలు హాస్యరస పోషకముగా నున్నవి.

20. అని, పాడిరపుడు, నృత్య
ధ్వని కేళి ఫణీంద్రమున్, ద్రవత్పాషాణం
బును, నిశ్చేష్టకురంగం
బును, మూకీకృత పతంగమునుగా నచటన్ (2-128)

ఈ పద్యము రామభద్రుని శైలీమాధుర్యమునకు నిదర్శనము.

వేశ్యలు తామెన్నో శాస్త్రము లభ్యసించితిమని ఆ రహస్యములాతని కెఱిగింతుమని, మీ రహస్యములేమో మాకు తెలుపుమని ఋష్యశృంగుని కోరినారు. ఆసనబంధముతో లభించు సమాధి, ఇంద్రియ నిగ్రహామలవడు నుపాయము, పవనధారణశక్తి- మీ రతి రహస్యముగా మాకు తెల్పరాదా? అని వేశ్యలు ఋష్యశృంగునితో చమత్కారముగాపల్కి- వనములోని పాములు నెమళ్ళు పరవశించి నాట్యమొనర్చునట్లు, పాషాణములు ద్రవించునట్లును, జింకలు నిశ్చేష్టములగునట్లును, విహంగములు నిశ్శబ్దములగునట్లును గానము చేసినారు

వారి గానమువిని ఋష్యశృంగు డద్భుతమంది వీరు సామవేద మర్మము లెఱింగిన పండితులని, యీ రమ్యవిద్య వీరి కడ నభ్యసింపవలెనని వీరితో చెల్మి యొనర్పవలెనని భావించినాఁడు ఇటి ఘట్టమున వేశ్యలు ఋష్యశృంగునకు భక్ష్యములను గానుకలుగా నిచ్చుట, గానమొనర్చుట.

నృత్యమొనర్చుట- మొదలగునవి చేసినట్లు కవి పంచేంద్రియ తర్పణ మొనర్చు వర్ణనలను జేసినాఁడు.

21. అణునిభమధ్య లాక్రియలు, నా పరిభాషలు నొప్ప; జిందు జ
క్కిణి కొరవంజి మేళములఁ జేలికసల్పిరి, దేవతా నటీ
మణులకు బొమ్మవెట్టుక్రియ, మర్దళతాళ నినాదపద్ధతిన్,
రణదురు రత్ననూపుర ఝణం ఝణముల్ మెఱయంబ
దాహతిన్. (2-131)

సన్నని నడుములుగల ఆ వేశ్యలు ఆయా నాట్యములకుఁ దగిన విధమున చిందు, జక్కిణి, కొఱవంజి మేళముల నవలంబించి, మద్దెల తాళముల కనుగుణముగా, మణి నూపురముల మ్రోతలు అతిశయించునట్లును, అప్సరసలకే ఆశ్చర్యము కలుగునట్లును నృత్యము చేసినారు.

నేత్రానందమును గొల్పు వేశ్యల నాట్యమును కవి అద్భుతముగా వర్ణించెను. చిందు, జక్కిణి, కొఱవంజి మేళము లిందు పేర్కొనఁ బడుటచే నయ్యలరాజు దేశి నాట్యాభిమానము వ్యక్తమగును. దేశి నాట్యపరిజ్ఞానము గల యిక్కవి తెనుఁగు నాటనున్న దేశి నాట్యములను రామాయణ కాలము నకను సంధించి తన దేశినాట్యాభిమానమును దెల్పెను.

22. బాలోన్మత్తపిశాచలీలలఁ బరబ్రహ్మను సంధాన వి
ద్యాలబ్ధిన్, హరిభక్తులౌ మునుల మందానంద నిర్మగ్నులై,
హేలా నర్తనగీతులన్, మెలఁగు చంద్రీలాగునన్,
వారె కాఁ
బోలున్ వీరని, యమ్మహామహుఁడు, సమ్మోదంబు
నొందెన్మదిన్.

పరబ్రహ్మను సంధాన విద్య నేర్చిన హరిభక్తులగు మునులు బాలురు ఉన్మత్తులు,పిశాచములు ఆడు విధమున నర్తించుచుందురని ఋష్యశృంగుఁడు వినియున్నాఁడు. ఆ మహానుభావులు వీరే కాఁబోలునని ఋష్యశృంగుడు వేశ్యలను గూర్చి మనసులో చాల సమ్మోదము నందినాఁడు. వేశ్యలను పర

బ్రహ్మానుసంధాన మొనర్చు హరిభక్తులనుగా భ్రమించుటచే నిందు భ్రాంతి మదలంకారమ్మున్నది. ఇట్లేర్పట్టున నిది మిగుల చమత్కారముగానున్నది.

వేదాంతములలో చరమస్థితి నందుకొన్నవారు బాలోన్మత్త పిశాచములవలె వర్తింతురు. ఈ విషయమును ఋష్యశృంగుడు తండ్రి యగు విభాండకునుండి గ్రహించియుండవచ్చును. ఋష్యశృంగుడు వేశ్యలను బాలోన్మత్తపిశాచములవలె భావించినాఁడు. పతితలకు నవ్వు పుట్టించినను అతనికట్లు నది సహజమే.

23. మా యాశ్రమమ్ములంగజ
మా యాశ్రమముల్ హరించు, మా బడిరమ్మా,
మా యూరు వింత డాసిన,
బాయకయుండెదవు, నీతపం బీడేఱున్.

తమ యాశ్రమములు అంగజమాయాశ్రమనులు హరించును, తమతో రమ్మని వేశ్యలు మునిని కోరినారు. శరీరజములైన శ్రమలను బోఁగొట్టునని, మన్మధసంబంధి శ్రమలను హరించునని యిట రెండర్థము లున్నవి.

అట్లే మా యూరు వింత డాసిన పాయక- అటనే ఉందువనుటలోఁ గూడ శ్లేషార్థము గ్రాహ్యము, తెలుఁగున ఊరు- అనగా గ్రామము. ఊరు వింత- అనగా మా గ్రామపు వింతలను (విశేషములను) సమీపించిన (చూచిన) విడిచియుండలేవు- అని ఒక యర్థము. సంస్కృతమున ఊరు అనగా తొడ. ఊరువు- అని తత్సమమగును. ఊరువు + ఇంత = తొడను ఇంత మాత్రము కొంచెము సమీపించినా విడువవు- అని రెండవ యర్థము.- ఇంత నేర్పుగా వేశ్యలు అమాయకుఁడగు ముని చెంతఁ బల్కినారు. ఒకే పదము సంస్కృతాంధ్రములుగా- రెండర్థములు వచ్చులాగున వాడిన కవి నేర్పు ప్రశంసార్హము.

అయ్యలరాజు రామభద్రుడు శ్లేష కవితా చక్రవర్తి. శ్లేష కవిత్వమాతనికుగ్గు బాలతో నలవడినది. ఇతని కవితలో నప్రయత్నముగా శ్లేషలు దొరలిపడు చుండును.

ఈతని శ్లేషాలంకారమునకు శబ్ద చిత్రణము తోడైనది. ఒక విచిత్ర మైన శబ్దాలంకారము నీతడు విరివిగాఁ బ్రయోగించెను. దీని లక్షణము-వచ్చిన పదమే మరల వచ్చినట్లు తోచును. కాని విఱుపు చేతను పదముల కాద్యంతముల కొన్ని యక్షరముల చేరిక చేతను అర్థమున మార్పు వచ్చి, ఒకే పదము పునరావృత్తమైనట్లు తోచి శ్రవః పేయముగా నుండును. ఇంచు మించుగా నిది జయదేవుడు పేర్కొన్న పునరుక్తి ప్రతీకాశము, విద్యానాధుడు పేర్కొన్న పునరుక్తవదాభాసమను శబ్దాలంకారమువలె నున్నది. దీనికి వారిచ్చిన లక్షణోదాహరణములం బరికింపుడు.

## పునరుక్తి ప్రతీకాశము

"పునరుక్తి ప్రతీకాశం పునరుక్తార్థ సంనిభం
అంశుకాంతం శశీకుర్వన్నంబరాంత స్త్రైత్యసౌ"

చంద్రాలోకము

## పునరుక్తవదాభాసము

"యత్రార్థః ప్రముఖే కించిద్భాసతే పునరుక్తవత్
పునరుక్తవదాభాసోఽలంకార స్సతాం మతః
ఉదా॥ జిష్ణురింద్రః క్షితిభుజాం శ్రీపతిః పురుషోత్తమః
భాస్వన్నూర్యస్ఫుర త్తేజాః కాకతీంద్రోవిరాజతే"

ప్రతాపరుద్రీయము.

వీరిచ్చిన యుదహరణములలో అర్థమే పునరుక్తమైనట్లాభాస కల్గుచున్నది; కాని శబ్దము పునరుక్తము కాలేదు. రామాభ్యుదయమున శబ్దము పునరుక్తమైనట్లు ఆభాస కల్గుచుండును. కనుక నిది యమకమే యగునేమో !

24. వసుమతి జనించి, దశరథ
వసుధాధి పసూతినై, యవశ్యము నిపుడ

య్యసు హితు, పఙ్క్తి కంధరు,
నసురహితుంజేయుదున్. భయం పడనేలా. (3-72)

రావణుని బారినుండి తమ్ము కాపాడుమని ప్రార్థించు దేవతలకు శ్రీ మహా విష్ణువు అభయమిచ్చుచున్నాడు. వీర రసమునకు స్థాయి భావమగు ఉత్సాహమున కిట బీజము వేయబడినది.

అసుర + హితున్ అసు + రహితున్ జేయుదున్

25. వేదాదుల నెడ బాయడు,
వేదాదుల మరగినాడు, వీఁడౌరా ! కే
లీదళఁ, బరవశుడై, మే
లీదశరథ రాజు భాగ్య, మిందటిలోనన్. (3-129)

రామాదులు జన్మించినపుడు చూడవచ్చిన పౌరులు రాముని గూర్చి, దశరథుని భాగ్యమును గూర్చి యిట్లు భావించినారు వేద + ఆదులు.— ఇట్లు సంస్కృతాంధ్ర భాషల రెంటికి మైత్రి కలిపి కవి చమత్కరించినాడు.

26. పాలింపు మిజ్జగంబులఁ,
బాలింపుగఁ ద్రావి, చలము వాటింపకు, మా
పాలింటి వాడవై, రే
పాలింటికి వచ్చినప్పు, డరయుము మమ్మున్. (3-133

పాలింపుము, పాలు + ఇంపుగ; మా పాలింటి వాడవు (మా పాలింటి వాఁడవు.) రేపు + ఆలింటికి (ఆలు + ఇంటికి) అని విడదీసికొనవలెను.

వాదులు రామునకు జోల పాడుచు నిట్లనిరి. పాలు ఇంపుగా (ప్రీతిగా) త్రాగి ఇజ్జగములను బాలింపు మన్నారు, రాముడు జగములను పాలించుటకేగదా అవతరించినది. మా పాలింటి వాఁడవై (మా వాఁడవై) రేపు నీ ఆలు ఇంటికి వచ్చినప్పుడు మమ్ము అరయవలెనని కోరుచున్నారు నాల్గవ చరణములో నున్న సొగసు కేవలము స్వభావోక్తి.

చంటి పిల్లలను గూర్చి "నీ పెళ్ళాం" వచ్చాక మా యందు నీకు భక్తి ప్రపత్తులుంటాయా? మేము నీకు జ్ఞాపకం ఉంటామా?" అనుటకద్దు ఆ భావముననుసరించి కవి శబ్దాలంకారముతో చమత్కరించినాడు

27. నందన వన వాసము, తన
డెందముఁ గుందింపగా,ఁ దొడింబడఁ దానున్,
నందన వనవాసము విభు
డొందె, రఘూత్తమునిఁ బాసియుండంగలఁడే ? (5-81)

నందన వన వాసము - అను పదమును కవి యిట శ్లేషార్థమున వాడెను. మొదట నందనుని వనవాసమని - రాముని వనవాసమని యర్థము. అది తన మనస్సును బాధింపగా దశరథుఁడు నందన వనవాసమున కేగెనట. దేవేంద్రుని నందనోద్యానమున నివసించుటకు - అనగా స్వర్గమునకు వెళ్ళెనని రెండవ యర్థము. కొడుకు దగ్గరకు వనవాసమునకు తాను వెళ్ళెనను విరోధము కనిపించును. కాని శ్లేషార్థముచే నది ఆభాసగా తేలిపోవును.

28. నీ లోపల బెగడొందకు,
నీ లోపల చికుర ! వీని నేలంగూలం
దూలింతు, నొక్క కోల, న
రాశతర క్రోధు, సాపరాధు విరాధున్. (5-109)

విరాధుఁడను రక్కసుడు వచ్చి సీతను ఎత్తుకొని పోవుచుండగా నామెను భయపడవలదని. ఆ రక్కసునొక్క కోలతో వధింతునని రాముఁ డనెను.

నీ + లోపల (తెలుఁగు) నీల + ఉపల చికుర [సంస్కృతము]
ఈ పద్యము పోతన గారి కవిత్వమునకు చాల దగ్గరగా నున్నది.

29. పులుగా ! నీ కొలది తలం
పులుగావివి, నాకు నాలమున, నెదురు నిలిం
పులుగారు, వలవది య్యిబ
పులు, గాసిల నేల, తొలగి పొమ్మా, యనుడున్. (5-195)

సీత నపహరించుకొని పోవు రావణుని జటాయు వెదిరించెను. అపు డాతనిని తొలఁగి పొమ్మని, తన్నెదిరింప శక్యముగాదని రావణుఁ డీ పద్య మునఁ బల్కినాఁడు. ఇందలి యమకము కవి కావలెనని కూర్చినది కాదు. రావణుఁడు జటాయువు నెంత పలుచనచేసి పల్కెనో ఝుడితిగా ధ్వనింపఁ జేయుటలో నీ యమకము తోడ్పడినది. అయాచితోపపన్నముగా నీత డందందు వాడిన యమకమీతని కవిత కొక గమకమును గూర్చుచుండును.

30. జాయను జూపవేమి ? యనుజా ! యను, నవ్విధి యెంత జేసె నో
రా! యను, నాదుగుండె బలురాయను, నాత్మ పరాక్ర
మోన్నతుల్
రోయును, గాననాంతరము రోయును, దుష్టకురంగ చేష్ట సు
మ్మా ! యను, జానకీ ! దనుజమాయను గ్రుంకితె, పల్కుమా,
యనున్ (5-225)

సీతాపహరణమైన తరువాత రామలక్ష్మణులు సీతంగానక దుఃఖించు సందర్భములోనిది. రాముఁడు లక్ష్మణునితో జాయను జూపవేమి ? అనుజా ! యని పల్కి దుఃఖించుచు పరి పరివిధముల తలపోసిన భావములిందుఁ గలవు.

ఆతని యమకము అప్రయత్న సిద్ధమగుటచే, ఆతడుద్దేశింపక పోయి నను కరుణ రసఘట్టములలోఁ గూడ పద్యరచన అదేపద్ధతిలో సాగిపోవును. ఇది కొందరికి పట్టీయవచ్చును. (పట్టింపు కావచ్చును.)

31. ఏల ప్రేలెడు తేటి ! యింతేటి కలుగ ?
సంశ్రితల సన్నగాలి ! యో సన్నగాలి !
చెల్లునే రోషరసమింత చిలుక ! చిలుక !
సారెఁ గుందింపఁ జందమా, చందమామ (6-25.)

సీతా వియోగముచే విరహవేదన ననుభవించు రాముడు చంద్రా ద్యుపాలంభ మొనర్చు సందర్భము. వానల సీతావిరహ దవానల మధికమైన దని రాముఁడు లక్ష్మణునితో మొత్తుకొని, మన్మధు బలగమునిట్లుపాలంభిం చెను.

తేటి + ఇంత + ఏటికి ?

ఝుంకారమొనర్చు తుమ్మెదరొద తన్ను బాధింపగా, ప్రేలెద వేల - అని తేటిని నిందించెను. ఆసత్ + నగ + అలి = లసన్నగాలి; సంశ్రితల సన్నగాలి = ఆశ్రయించిన చెట్లవరుసగలదానా !, సన్నగాలి! అలుక యింతేటికి ? చిలుకా! రోషరసమింత చిలుకఁదగునా ?, చందమామా ! మాటిమాటికి నన్ను కుందించుటే నీ చందమా?— ఇట్లు రాము డొనర్చిన చంద్రాద్యుపాలంభమతి సుకుమారముగానున్నది.

32. సుగ్రీవ : సమయమయ్యె, ద
శగ్రీవు జయింపఁ దడయఁజనునే, తారా
సుగ్రీవా సుఖాసక్తిఁ గ
రగ్రీవ నిభుండు సుమ్ము, రఘుపతి, కినుకన్.

రామసుగ్రీవులు మైత్రి చేసినారు. వారి ఒప్పందము ప్రకారము సుగ్రీవునికి ప్రమాదముగానున్న వాలిని రాముఁడు వధించినాఁడు. ఇఁక సుగ్రీవుడు సీత జాడ తెలిసికొని రామునికి నివేదించవలసి యున్నది. ఇంతలో సీతాన్వేషణకు అవరోధముగా వర్షాకాలము వచ్చినది. వర్షాకాలము గడిచిన పిదప సీతాన్వేషణము చేయవలెననుకొందురు. భోగముల మునిగి తేలుచున్న సుగ్రీవునకు, శరదృతువురాగానే హనుమ యిట్లు బోధించెను.

రాముఁడు కోపమున విషకంఠుఁడే- అనగా సాక్షాత్తు రుద్రుడే. కాన ఆతని కోపమునకు గురిగాక సీతాన్వేషణ సాగింపుమని హెచ్చరించినాఁడు.

సుగ్రీవ శబ్దముతో కవి చమత్కరించినాఁడు. మొదటిమారు సుగ్రీవునకు సంబోధన. రెండవమారు సుగ్రీవ = మంచిమెడగలది = స్త్రీ = (తార)- అని యర్థము. ఆమెతో సుఖించు కోర్కెతో జాగు సేయరాదనుచున్నాఁడు.

రావణుఁడు దశగ్రీవుఁడు కాఁగా, రాముడు గరగ్రీవుడే = విషకంఠుడే. రామునిచే రావణవధ తప్పదని సూచింపబడినది.

ఈ పద్యమున ద్విప్రాసము గలదు.

ఇట్లు శబ్దపునరుక్తి రామాభ్యుదయమున విరివిగా కానవచ్చుచున్నది.

33. ఆవర్తధూమ చికుర ధు
రావహామున్, శ్రుతిమనోహర స్వరము, శుభాం
గావిష్కృతంబునై, భా
మావేషము దాల్చెనపుడు, మఖవాటి తగన్. (3-18)

దశరథుఁడు పుత్రకామేష్టి యొనర్చుచున్నాఁడు. కవి యీ పద్యమున దశరథుని యజ్ఞవాటిక భామారూపమును దాల్చెనని చెప్పినాఁడు. స్త్రీపరముగను, యజ్ఞ వాటి పరముగను రెండు అర్థములును భావించుటకు వీలుగా రచన చేసినాఁడు.

సుడులు తిరుగుచున్న యాగధూమములు ముంగురులుగా, శ్రుతి సమ్మతస్వరము సుస్వరముగా శుభాంగసంపన్నమైన ఆ యజ్ఞ వాటిక భామా వేషమును దాల్చినది- అని భావము.

శ్లేషోపమ మనోహరముగానున్నది.

34. వ్యంజన విభక్తి చాతురినందమొంది,
కర్మ కారక గుణవృద్ధి గరిమనొంది,
యుత్తమాగమ పురుషాగమోత్తమగుచుఁ
గ్రతు భుజక్రియ, మించె, వ్యాకరణ సరణి. (3-20)

ఈ పద్యమునఁ గూడ శ్లిష్టోపమ వాడి దశరథుని పుత్త్రికామేష్టి వ్యాకరణమువలె నున్నదని కవి చెప్పినాఁడు.

వ్యంజనవిభక్తి చాతుర్యము (హల్లులను విభజించు విధము పదార్థములను విభజించు విధము) గలిగి, కర్మకారకగుణవృద్ధి (కర్మ కారకములు, గుణములు- అను వాని వృద్ధి- కార్యములు చేయు గుణముల పెంపు) తో అతిశయించి; ఉత్తమ ఆగమపురుషాగమము (ఉత్తమ పురుష సర్వనామము

వచ్చుట- ఉత్తమమైన ఆగమములు చదివిన ఉత్తమపురుషునిరాక) పొందిన ఆక్రతుకార్యము వ్యాకరణ మర్యాద వహించినది.

ఆగమము = దేవపూజా విధానమునకుఁ జెదిన శాస్త్రము.

35. హరిమధ్యయనుట, వర మం
ధరగామినులందు, వర్ణనామాత్రమగున్,
బరమార్థము, గౌసల్యాం
బురుహాక్షికి, విష్ణు గర్భమునఁ బూనుటచేన్ (3-36)

హరి మధ్యయనగా సింహమునడుము వంటి నడుము గలది (స్త్రీ) అని యర్థము. సాధారణముగా స్త్రీలను హరి మధ్యలనుట వర్ణనామాత్రమే. కాని విష్ణుదేవుని గర్భమున ధరించుటచే నిజముగ హరి మధ్య కౌసల్యయే. ఇది సాహిత్యములో అపురూపమైన భావనము.

36. దొరసి ప్రభాధురంధరుఁ, జతుర్దశలోకధరున్, మహాత్ముసే
కరణిని. గోసలేంద్రసుత గాంచెనొకో,యని, నాభి పంకజాం
తరమునఁ బెక్కు బ్రహ్మలఁ గనంగల వేల్పునకెట్టు బొడ్డుగో
సిరో? యని, పల్కి రర్యమరుచిన్, రఘునందనుఁజూచి చూపరుల్
(3-128)

అయ్యలరాజు రామభద్రుఁడు పోతనగారివలె గొప్ప రామభక్తుడు. హృదయ పద్మాధిష్ఠిత రామభద్రుఁడనని ఆతడే తన గద్యలో చెప్పికొని నాఁడు. అందువలననే కాఁబోలు అడుగడుగునను భక్తి పారవశ్యముతో రాముని శ్రీమహావిష్ణువుగా భావించినాఁడు. శ్రీరాముని (రాకుమారులను) జూడ వచ్చిన పురజనులాడు పలుకులను కవి భక్తి భావ భరితముగా నీ పద్యమున వివరించినాఁడు.

తన కుక్షిలో పదునాల్గులోకములను దాల్చిన మహానుభావుని కౌసల్య యెట్లు కన్నదో గదా? నాభిపద్మమునఁ బెక్కు బ్రహ్మలను గనంగల దేవునకు బొడ్డు నెట్లు కోసిరో! అని పురజనులాశ్చర్య పడిరట. రామ భక్తి పారవశ్యమున తన హృద్గత భావమును పౌరులచేఁ బల్కించినాఁడు.

37. శిలఁ జిగురుఁబోఁడియై, యుల్లసిల నొనర్చి,
యెత్తి పోయిన, గౌతము నిల్లు నిలిపె,
నడుగు కెందమ్మి కమ్మ పుప్పొడిన, యింక
నేమని, నుతింపవచ్చు, శ్రీరాము మహిమ (4-57)

అహల్యా శాపవిమోచన ఘట్టము. రాముఁడు తన పాదధూళిచే శిలను చిగురుఁబోఁడియై యుల్లసిలునట్లొనర్చినాఁడు. ఎత్తిపోయిన గౌతమునిల్లు నిలిపినాఁడు. శిలను చిగురుఁబోఁడిగా చేసెననుటచే శిలను కూడ చిగురింపఁ జేసినాఁడను భావము ప్రకటమగు చున్నది. చిగురుఁ బోఁడి యనగా చిగురు వంటి శరీరము కలది-స్త్రీ-అని యర్థము. స్త్రీ-అను నర్థమును బోధించు పదములు పెక్కులుండగా, కవి యిట చిగురుఁ బోఁడి-అను పదమును వాడుటలోని ఆంతర్య మిదియే. శిలను గూడ చిగురింపఁజేయు రాముని శక్తి (మహిమ) సామాన్యమైనదిగాదు.

రాముని పాదధూళి యని చెప్పుటకు కవి వాడిన ఆచ్ఛికసమాస మెంత మృదు మధురముగా నున్నదో చూడుడు.

"అడుగు కెందమ్మి కమ్మ పుప్పొడిన" అనగా పాదపద్మమందలి కమ్మని పుప్పొడిచే-ధూళిచేనని చెప్పక ఉపమేయమును దాచి కమ్మని పుప్పొడిచేనని ఉపమానమును జెప్పుటచే నిట రూపకాతిశయోక్త్యలంకార మున్నది. అడుగు కెందమ్మి యనునపుడు-రూపకము ఇందలి అలంకార మాధుర్యము అనుభవైక వేద్యము.

శప్తాహల్యను పాషాణరూపగా వాల్మీకి చిత్రింప లేదు కాని అధ్యాత్మ రామాయణానుసార మీతడిట్లు చెప్పినాడు.

శిలను చిగురుఁబోఁడిగా, జేయుటేగాక గౌతమునిల్లు నిలబెట్టుట మరి యొక విశేషము. గౌతమునిల్లు మూల పడినది. పాడు పడినది-అనుటకు ఎత్తిపోయిన-అను చక్కని తెలుఁగు జాతీయము వాడఁబడినది.

రాముని పాదధూళి మహిమనింతగా వర్ణించి కవి యింక నేమని నుతింప వచ్చు. శ్రీరాము మహిమ-అని యింత కంటే వేరుగా చెప్ప నక్కఱలేదని రాముని మహిమాతిశయమును జెప్పినాఁడు.

38. కమలంబు మోము, కన్నులు
కమలంబులు, కేలుఁగవయుఁ గమలము,లడుగుల్
కమలంబులు, నిలువెల్లను,
గమలాకృతిమించెఁ, బుడమి కన్నియ, బళిరే (4-67

విశ్వామిత్రుఁడు సీతాదేవి సౌందర్యమును రామునకు వర్ణించి చెప్పు ఘట్టము. ఇది అమూలకము. ఈ పద్యము సీత సౌందర్యాతిశయమునే గాక ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవి-అను భావమును స్ఫురింపఁ జేయుచున్నది. ఆమె మహాలక్ష్మి యనియు పద్మినీ వరవర్ణని యనియును ధ్వని.

మిథిలానగరమును ప్రవేశించిన పిదప విశ్వామిత్రుఁడు సీతా స్వయంవర ప్రసక్తియొనర్చి సీత అందచందములను రామునకు వర్ణించి చెప్పినట్లుగా కవి రచించినాఁడు. ప్రబంధ పరిపాటి యని భావించినచో కవి నాయికా సౌందర్యమును దానై వర్ణించిన బాగుండెడిది. విశ్వామిత్రునిచే రామునకు సీతా సాధ్వి సౌందర్యమును వర్ణించి చెప్పించుట ఆశ్చర్యకరముగా నున్నది.

39 చొక్కపుఁబసిండి నక్కుల,చెక్కు, జెక్కు,
లక్కలికి కొప్పు నీలాంబుముక్కు, ముక్కు
కనకగంధ ఫలీసారకంబు, కంబు
కలితరేఖా విలాసమంగళము, గళము. (4-69)

సీతా సౌందర్య వర్ణనములోనిదే యీ పద్యము —మేలిమి బంగారు నక్కులు చెక్కు చెక్కులు (చెక్కిళ్ళు) ఆమెవి. ఆమె కొప్పు నీలాంబుముక్కు [నల్లని మబ్బు] ముక్కు బంగారు సంపెంగ పోలువు. పోలువు మీఱు గళము [కంఠము] కంబు కలిత రేఖా విలాస మంగళము. [శంఖరేఖ చక్కఁదనమున శుభమైనది.]

కవి సమయ ప్రకారము ఆయా యుపమానములతో నామె అవయవములను బోల్చుటేగాక, కవి యిందు వాడిన ముక్తపదగ్రస్తాలంకారము కవికి గల శబ్దాలంకార ప్రీతిని చాటు చున్నది. ముచ్చట గొల్పుచు నిందలి ముక్తపదగ్రస్తము హృదయావర్జకముగా మన్నది. ఈతని యీ రచనా

మార్గము చేమకూరకవి చమత్కారములకు ఒరవడిగానయ్యెనని గ్రహింపవచ్చును.

40. కొఱలె, మంజులలాటాంగ కుంతలాది
సౌష్ఠవంబున, భూతనూజాత. సీత,
యఖిలదేశ ప్రసిద్ధ భాగ్యంబు కలిమి,
తల్లి బోలిన. దదియపో ధన్య కన్య [4-70]

సీత యందమును గూర్చియే యిందును జెప్పుచున్నాఁడు. మంజు లలాటాంగ కుంతలాది సౌష్ఠవమున [చక్కని నుదురు, అవయవములు, ముంగురులు—అను వాని యోగ్యతయందు.] ఆ భూతనూజాత మంజుల లాటాంగ కుంతలాది దేశప్రసిద్ధ [మనోహరమైన లాట, అంగ కుంతల- అను దేశాల యందలి ప్రసిద్ధమైన] భాగ్యమై తల్లిని పోలినది. తల్లిని పోలిన అట్టి కన్య గదా ధన్య—అని సమర్థించుచున్నాడు. ఇందు సభంగ శ్లేష. అర్థాంతరన్యాసములున్నవి.

భూమియందా యా దేశములున్నవి. భూ పుత్రియు తన అవయవ శోభలో తల్లియొక్క సంపదకల్గి యున్నది. కనుక ఆమె ధన్యురాలు. తల్లిపోలిన కన్య ధన్యురాలని, అయ్యలరాజు చెప్పుచున్నాఁడు. వసుచరిత్ర కారుడు గిరి విరహ ఘట్టమున "నిక్కమ్ముగ తంకి చాయగల కన్యలు ధన్యలుగా వసుంధరన్" అని చెప్పినాఁడు.

అయ్యలరాజు చమత్కారమునకు తల్లి ప్రధాన భూమిక యైనది. రామరాజ భూషణునకిది నచ్చక "ధన్యాపితృముఖీ కన్యా" అను సూక్తి ననుసరించినాఁడు.

41. శిరసంటెన్, గల కంఠియోర్తు, కరరాజీవాంతరస్యంది, తై
లరసా స్వాది, వినీలకేశ మదరోలంబంబు లుడ్డీన వై
ఖరులన్, గాంచనకాచకంకణ ఝణత్కారారవచ్ఛద్మ ఝుం
కరణంబుల్ సలుపన్, రఘూత్తమునకున్. గల్యాణ
సంధాయికిన్. [4-106]

యువతులు శ్రీరాముని పెండ్లి కొడుకును జేయుచున్నారు. ఒక కల కంఠ రాముని శిరసంటినది. ఆ కలకంఠి తన ఎఱ్ఱదామర వంటి అఱ చేతిలోని తైలము పరిమళమునకై గండు తుమ్మెదలు మూగుచున్న విధమున నీల కేశములు ఎగసిపడు శ్రీరాముని శిరమున మధుర కంకణనినాదములతో తైలమంటినది.

సన్నివేశ సౌందర్యమున కనుకూలమైన విశిష్ట పద రచనతో గూడి వైదర్భి రీతిలో ద్రాక్షా పాకమున మాధుర్య గుణముతో నొప్పుచున్నదీ పద్యము. ప్రసన్నమగు అయ్యలరాజు శైలీ మాధుర్యమునకీ పద్యమొక మచ్చుతునక.

42\. కలికియొకర్తు. రాముని జగత్త్రియమోహన దివ్య రూపమం
గళపటు విగ్రహంబు పసగాంచుతమిం, గటిఁ బూని, మేఖలా
వలయము, గీలు కొల్పమఱువన్. దిగజాఱిన యప్పుడవ్వధూ
కులమణి, కోమలాంగ లతకున్, గుదురుంబలె నొప్పెఁ,
జుట్టునున్. [4-148]

రఘు కుమారులు భార్యలతో అయోధ్యా నగరమును ప్రవేశించిన వార్తవిని పుర కాంతలందఱు సౌధాగ్రంబుల నిలిచి వారిని చూడసాగిరి. అప్పుడు ఒక సుందరి కటిస్థలమున మొల నూలు అలంకరించుకొనుచు రామ చంద్రుని చూచుచున్నందున పారవశ్యమొంది ఆ యాభరణమును బిగించు కొనుట మరచినది. ఆ భూషణము ఆమె పాదములమీదకు దిగిజారి ఆమె శరీర లతకు కుదురువలె ప్రకాశించినది.

అంగలత - రూపకము

కుదురుంబలెనొప్పెఁ జుట్టునన్ - ఉపమా.

రాముని దివ్య మంగళ రూపమును గాంచు నాతి పారవశ్యమును కవి యద్భుతముగాఁ జిత్రించినాఁడు. మాధుర్య గుణ శోభితమై వైదర్భి రీతిలో ద్రాక్షా పాకమున నొప్పుచున్నదీ పద్యము.

ఇందు కవి యొనర్చిన ప్రబంధోచిత కల్పన రమణీయము. ఇట్టి సందర్భ న ప్రబంధ కవులందఱు పోవు మార్గమునే ఈతఁడును అనుస రించెను. కాని కల్పన క్రొత్తది.

43. అని, చతురోక్తి వేడుకొని, యల్లననంక తలంబు సేర్చి, వే
గ్చిన తమి, చేవడంక, నునుఁ జెక్కిలి నొక్కి, కవుంగిలించినన్
దనువునఁ గంప మొంది, తనుదా సడలెన్ దృఢనీవి, బంధమో
చనమగుట ద్భుతంబె, రఘు చంద్రుని ప్రాపొక యింత కల్గినన్
[4-164]

ఈ కవి లోక జననీ జనకులగు సీతా రాముల సంయోగమును వర్ణించి నాఁడు. ఏకాంతమున రాముఁడు సీతను సుముఖురాలి నొనర్చుకొను సన్ని వేశము. రాముఁడు సీతతో నిట్లనుచున్నాఁడు" తరుణీ నిను కన్న జనకుడు మహోదారుఁడు. అది గాక నీవు కలిమి జవరాలవు. చేవదల నేల ? ఈ పోకముడి వదల్చి ఒక్కనిడె మీయరాదా ?" అని ఆ రసి కాగ్రే సరుడు చతుర వచనములతో సీతను ప్రబతిమాలినాడు

రాముడిట్లు చతురోకులతో వేడుకొని, యీ పద్యమున ఆమెను తన అంకతలమునఁ జేర్చుకొని, పేర్చినతమిచే వణకుచు ఆ రమణీమణిని చెక్కిలి నొక్కి కౌగలించు కొనినాఁడు వెంటనే ఆమె శరీరము జల్లుమన్నది. గట్టిగా బిగిచుకొన్న పోకముడి తనంతట తానే వీడినది. రఘుచంద్రుని ప్రాపు ఏ కొంచెమున్నను బంధమోచనము కల్గుట ఆశ్చర్యమా ? అని కవి సమర్థించు చున్నాడు.

అయ్యలరాజు రామభద్రుఁడు ఔచితీనిర్వహణమునం గడు సమర్థుడు. సీతా రాముల యేకాంతమును వర్ణించు నీ పద్యములో "బంధమోచనము" అను శ్లిష్ట పద్యమును మిగుల హృదయంగమముగా వాడినాఁడు. ఆ సన్నివేశమును సామాన్యుల వలె చిత్రింపక శృంగారము నుండి వేదాంతము నకు చంక్రమించినాఁడు. బంధ మోచనమగుటద్భుతంబె రఘుచంద్రుని ప్రాపొక యింత గల్గినన్" అను వాక్యములోని శ్లేష చమత్కారము సహృదయ హృదయరంజకముగా నున్నది. రాముని ప్రాపున మోక్షము

లభ్యమగునని భక్తి పారవశ్యమున కవి సీతా నీవీ బంధమోక్షణ మాధారముగాఁ గొని చెప్పుట అత్యద్భుతముగా నున్నది.

ఇందలి అర్థాంతరన్యాసము వేదాంత స్ఫోరకముగా నున్నది. శృంగారమునందును అయ్యలరాజు వేదాంతమే భావన చేయుననుట కిది యొక నిదర్శనము. ఇట శృంగార ఘట్టమునగూడ కవి వేదాంతమును జెప్పుట ఔచిత్య దృష్టితోనే అని గ్రహింప నగును. రామాభ్యుదయమును ప్రబంధముగా వ్రాయదలచినందున సంభోగమును వర్ణింపవలసి వచ్చినను, కవికి వేదాంత భావనకూడ కలదనుట కిది నిదర్శనము. ఇందని అర్థాంతర న్యాసమొక చక్కని సూక్తి. రామ భక్తులవశ్యము మననము చేయఁదగిన సూక్తి

44. హా ! యను, గాధినందన మఖారినిశాట మదాపహారిహా
హా యను, గ్రావ జీవద పదాంబుజహా ! యను, రాజలోకసిం
హా ! యనుఁ, బోషితార్య నివహా ! యనుఁ, గానలకేగితేనిరీ
హా ! యని, నిర్వహింపగలనా, నిను బాసి, రఘూద్వహా !
యనున్. [5-10]

రామ వన గమనమప్డు పుత్త్రి వియోగమును సహింపలేని దశరథుడు పరి పరి విధముల తలపోయుచు విలపించిన సందర్భములోనిదీ పద్యము.

తిక్కనగారి బాణీలో కవి ఈ పద్యమును రచించుట గమనార్హము. అభిమన్యు వధా ఘట్టమున అర్జునుని శోకమును తిక్కన రచించిన విధమును చిత్తగింపుడు.

హా ! యను, ధర్మరాజ తనయాయను, నన్నెడఁబాయనీకుఁజ
న్నేయనుఁ, దల్లి నేప జనునేయనుఁ, గృష్ణుఁడు వీఁడెవచ్చెరా
వేయను, నొంటి వోకఁ దగవే యను, నేగతిఁ బోవు వాఁడనే
నోయభిమన్యు డాయను, ప్రియోక్తుల నుత్తరఁ దేల్ప వేయనున్
[భారతం - ద్రోణ - 2-242]

ఇష్ట జన వియోగము కలిగినపుడు దుఃఖాతిరేకమున ఎడ తెరిపి లేకుండాపరి పరి విధముల తలపోయుచు దుఃఖించుట సహజము. ఆ దృష్టితో తిక్కనను అయ్యల రాజు అనుకరించెనని చెప్పవచ్చును. అయినను తిక్కనను మించి ఈతఁడొక చమత్కారమును సాధించెను.

రామాభ్యుదయమున "హా యను'' శబ్దము మాటి మాటికి వచ్చినదే గాని యర్థము మాత్రము మారుచున్నది. ఇది యొక విధమైన శబ్ద చమత్కృతి.

హా + అను = హా యను [యడాగమము] హా ! యను- మొదటి సారి విచార సూచకము. తరువాతి వన్నియు కుమారునకు సంబోధనలే. చివరకు "రఘూద్వహా ! నిను బాసి నిర్వహింపగలవా ? " అని కొడుకును విడిచి మనుగడ సాగించలేనని దశరథుఁడు బాధపడినాడు.

తిక్కన పద్యములో విచారసూచకముగా పద్యాదియందే 'హా !' యను అక్షరమును వాడినాఁడు. ఇతడు తిక్కనను అనుకరించినను పెక్కు చోట్ల 'హా' అను అక్షరమునువాడుచు పఠితలకు హాహాకారములు స్ఫురించు నట్లు గణనీయమైన రచన చేసినాఁడు.

45 కానక కన్న సంతానంబు గావునఁ
గానక కన్న సంతానమాయె
నరయ గోత్ర నిధానమై తోచుగావున
నఁయ గోత్ర నిధానమయ్యె నేడు
ద్విజకులాదరణ వర్ధిష్ణుడు గావున
ద్విజకులాదరణ వర్ధిష్ణుఁ డయ్యె
వివిధాగమాంత సంవేద్యుండు గావున
వివిధాగమాంత సంవేద్యుఁ డయ్యెఁ

గటకటా! దాశరథి! సముత్కట కరీంద్ర
కట కలిత దాన ధారార్ద్ర కటకమార్గ
గామి, యెటు చరించు, నుత్కట కరీంద్ర
కట కలిత దాన ధారార్ద్ర కటకతటుల [5-12]

రామవనగమన సందర్భముననే పుత్త్రవియోగముచే కుందు దశరథుని విలాపమును కవి యీ పద్యమున వర్ణించినాఁడు. ఇందలి శ్లేష సౌకుమార్యము గమనార్హము. ఈ పద్యమున పూర్వోత్తర దళములు రెండును బాహిరముగా నొక్కటేయైనను అర్థము మాత్రము భేదించుచున్నది.

1. కానకకన్న సంతానంబు- కలుగక కలుగక కలిగిన సంతానము, అడవి కోలకేకన్న సంతానము.

2. గోత్రనిధానము- వంశమునకు మూలమైనది, కొండలు నివాసముగా గలది.

3. ద్విజకుల ధారణ వరిష్ఠుఁడు - బ్రహ్మణకులమును బోషించువాఁడు, పక్షి సమాదాయమును బోషించువాఁడు.

4. వివిధాగమాంత సంవేద్యుఁడు - బహువిధ వేదాంతములవలన దెలిసికొనఁదగినవాఁడు, బహువిధ వృక్షముల నడుమ తెలిసికొనఁదగినవాఁడు.

5. సముత్కట కరీంద్ర....కటకమార్గగామి —— ఏనుగుల మదజల ధారలచే తడిసిన పురముల కేగువాఁడు: ఏనుగుల మదజల ధారలచే తడిసిన కొండవాలులుగల త్రోవలందు సంచరించువాఁడు.

దశరథుఁడీ రెండర్థముల నాలోచించు దుఃఖించెనా ? కరుణ రస ఘట్టమున నిట్లు శ్లేష వాడుట యుచితముగాదని కొందఱి యభిప్రాయము.

అయ్యల రాజునకు శ్లేష కవిత్వ ముగ్గుబాలతో నలవడినది. శ్లేష కవితా ధోరణి అతనికి జీర్ణించుకొని పోయినది. అందుచేతనే యిచటను శ్లేష పద్యమును రచించినాఁడు. సావధానముగాఁ బరిశీలించినచో నిందు ఆక్షేపణకు తావులేదు. లోకములో ఇష్ట జనవియోగము నొందినవారు

తమ వాఁడు వెనుక నంతటి వాఁడు నేడిట్లాయెను గదా! అని తలపోయుట గలదు ఆ దృష్టితోఁజూచిన నిది సమర్థనీయమే.

అయ్యల రాజు కవిత్వమునకు ప్రధానముగా శ్లేషము జీవము. అది అప్రయత్న సిద్ధము. అన్ని పద్యములవలెనే ఈ పద్యమును వ్రాసినాఁడు. పద్యము అత్యంత రమణీయము - అనితర సాధ్యమనియును జెప్పవచ్చును. దశరథుడు శ్లేషలో నేడ్చెనా? అనునది సరసమైన సందేహము కాదు. ఆతఁడెట్లేడ్చెనో మనకుఁ దెలియదు. కరుణ రసమొలికించు పట్టున నొక్కొక్క కవి ఒక్కొక్క విధముగా పాత్రలచే నేడ్పించును. ఉదా॥ పెద్దన, తిమ్మన, భట్టుమూర్తి.

ఏడుపుల తీరు వారి వారి ప్రకృతులను బట్టి యుండును. దశరథుఁడు మహారాజు. ఆతడీవిధముగా రామభద్రుఁడు భావించెను. "హా యను" రెండు పద్యములును దీని పైననే యున్నవి. వాస్తవమునకా యేడుపు చాలును. కానిదశరథుని యేడుపులో చిత్ర విచిత్రమైన భావములను గోచరింపఁజేసెను. అంతటి వాడింతటివాఁడయ్యెనని చెప్పుట ఈ పద్యము లోని పిండితార్థము.

ఆక్షేపణము లెన్ని విధములుగా నైనను జేయవచ్చును. హరిశ్చంద్ర నాటకమున చంద్రమతి యేడ్చునపుడు బలిజేపల్లి వారు పద్యములను వ్రాసిరి. నాటకములలో పద్యములుండ కూడదనెడివారు. చంద్రమతి, పద్యములలో నేడ్చెనా? అని యాక్షేపించిరి. అదియు నొక యాక్షేపణమే. ముక్కులో నేవేలైనను పట్టును. కాని ఆ పద్యముల నభినందించువారున్నారు. పద్యములలో నేడ్చుట అంగీకార్యమైనచో రామభద్రుని పద్యములలో శ్లేష యుండుటయు నంగీకార్యమే. లేనిచో నేదియు లేదు.

అంతయును భావనయే గదా! ఆ భావన రమ్యముగా నున్నదా? లేదా? అని చూడవలెను. రమ్యముగానున్న దనుకొనుట చేతనే ఈ పద్యమునకా ప్రశస్తి వచ్చినది.

46. అతుల, భూజాన్వితుండ వైనట్టి, నీకు,
సర్వదా రామయుతకు. నిజ్జనక సుతకు.

నెఱుఁగ రాదెండవడ, దేవ ! యిట్టి, మీ ప
దాబ్జముల నీడ నున్న, నా కలఁత గలదె ? [5-48]

సీతా రాముల పదాబ్జముల చెంత నున్న తనకు అలసట లేదని లక్ష్మ ణుఁడు పల్కుచున్నాఁడు. వనవాస కాలమున ఎండలో నలసిపోయిన లక్ష్మణుని తమవద్దకు చెట్ల నీడకు రమ్మని పలుకు రామునకు లక్ష్మణుఁడిచ్చిన సమాధానమిది

ఈ చిన్న పద్యములోని శ్లేష సౌందర్యము హృదయంగమము. భూజ + అన్వితుడు = సీతతో కూడుకొన్న వాఁడు, చెట్టు నీడ నున్న వాఁడు- రాముఁడు; సీత సర్వదా = ఎల్లపుడు, రామయుత = రాము నితో కూడుకొన్నది. సర్వదా + ఆరామయుత = ఎల్లపుడు ఉద్యాన వనమున నుండునది.— అట్టి సీతారాముల పాదపద్మముల చెంతనున్న తనకు అలసట లేదట ! ఎంతటి భక్తి ! ఇందు లక్ష్మణుని భక్తితోపాటు అయ్యల రాజు భక్తిభావమును ప్రకటమగుచున్నది.

47. ఉచ్చరించు, మయూర, ముపనిషద్వాక్యంబు
పారావతంబు, శబ్దంబు నొడువు
శారిక, తర్కశాస్త్రంబు, వక్కాణించుఁ
గల కంఠములు, షడంగముల నెఱుఁగు
హంసలు, భయ మీమాంసలు పరికించు
రాచిల్క, శ్రౌత మార్గములు దెలుపు
నలఘు, పురాణార్థములకు, ఁజొక్కుఁ గురంగి
సామగానము విను, సామజంబు
ఖంజరీటంబు, వైశేషికము విధించుఁ
గ్రౌంచమిధునంబు, యోగవైఖరి భజించుఁ
దరమె కొనియాడ, ఘటజన్మ తాపసాగ్ర
గణ్యపుణ్యతమాశ్రమా మారణ్యభూమి [5-113]

రాఘవులు గాంచిన అగస్త్యాశ్రమ శోభను కవి యీ పద్యమున వర్ణించినాఁడు. నెమిలి ఉపనిషద్వాక్య ముచ్చరింపగా, పావురము శబ్దము

పలుకుచున్నది. గోరువంక తర్కము ప్రారంభింపగా, కోకిలలు షడంగములు నుచ్చటించుచున్నవి. హంసలు (పరమహంసలు) ఉభయ మీమాంసలు విచారింపగా, రాచిలుక శ్రౌతమార్గము లుపన్యసించుచున్నది. ఆడు లేడి పురాణార్థములు విని పారవశ్యమందుచుండగా, సామజము [ఏనుగు] సామగానము లాలించుచు తన్మయమగుచున్నది. కాటుకపిట్ట వైశేషికము విధించుచున్నది. క్రౌంచ మిథునము యోగమార్గ మవలంబించుచున్నది.- అట్టి పుణ్యాశ్రమమగు అగస్త్యాశ్రమభూమిని కొనియాడ తరముగాదని భావము.

ఈ మాదిరిగా పద్యము వ్రాయుట చాల కష్టము. శైలి రమణీయముగానున్నది అచటి అల్పప్రాణులును తత్తత్పుణ్య విశేషమున ఆశ్రమ విద్యల నెఱుగుననుటచే నాయాశ్రమ జాతకృత్యములు వెల్లడియగుచున్నది. ఈ పద్యము ననుసరించి వెంటనే

"బలుఁ ద్రాచు రాచకూనలు వోలె, నిగనిగ
జడిగొన్న, నిడుద కెంజడలు గదల"

ఇత్యాది పద్యమున అగస్త్యుని మూర్తి చిత్రణమును కవి కనులకుఁ గట్టినట్లు అతిసహజముగాఁ జిత్రించినాఁడు. ఈ పద్యమున 'వింధ్యనగమర్ది' రాఘవున కెదురేగెనని చెప్పెను. ఈ పద్యము మనుచరిత్రమందలి సిద్ధుని వర్ణనమువలె రమణీయముగా నున్నది.

48. శశిరోచిష్ణు కళాకలాప, వదనాబ్జాతుండు; రాజన్యలో
కశిరోరత్నము చాపనైపుణ పరిష్కారుండు, నానాసుధీ
వశిరోలంబ శరణ్య పాదకమలద్వంద్వుండు, మూద్యత్ఖర
త్రిశిరోదూషణ, కంఠలుంఠన మొనర్చెం, జండకాండంబులన్.
(5-153)

శ్రీరాముఁడు చండకాండముల ఖరదూషణ త్రిశిరుల కంఠలుంఠన మొనర్చిన తీరున కనుకూలమైన శబ్దములను కవి వాడెను. ఇందీతని సమాస ఘటన ఆహ్లాదకరముగా నున్నది. చంద్రవదనుడనుటకు- శశిరోచిష్ణు కళా

కలాప వదనాబ్జాతుండు- అనినాఁడు. మునుల కాశ్రయభూతుడనుటకు- నానా సుధీవశిరోలంబ శరణ్య పాదకమలద్వందుండు- అనెను. ఎంత మనోహరముగా నున్నదీ సమాసము.

ఈ పద్యములోని రచనావైఖరి పోతన భాగవత పద్య ఫణితికి దీటుగానున్నది. ఈ పద్యమున ద్విప్రాసముండుట గమనార్హము. చమత్కారప్రియుఁడగు రామభద్రుఁడు కొన్ని త్రిప్రాస పద్యములను, చతుప్ప్రాస పద్యములను, కొన్ని యెడల దుష్కరప్రాస పద్యములను గూడ రచించెను.

49. బలియుఁడ, నీయెడాటమున,ఁ బక్షినిఁగా,ఁ బ్రతిపక్షవృత్తి, నీ
తలల వనీతలంబుదెస,ఁ దాళ ఫలాకృతి రాల, లీలమై
జలజలడుల్లు, నిల్తునని చక్క,ఁ బతంగ కులీను భార్య, ని
ర్మల తరచర్యఁడించి, చనుమా, మనుమా, మనుజాశనాధమా !
(5-196)

రామభద్రుని నాటకీయ శైలికీపద్యమొక చక్కని యుదాహరణము.

సీతనపహరించు కొనిపోవు రావణు నెదిరించి జటాయువు పల్కు వీరాలాపము లీ పద్యమునఁ గలవు. తన్ను తృణీకరించిన రావణునితో జటాయు విట్లనుచున్నాఁడు.

"రాక్షసాధమా ! ఏమి నీవంత బలశాలివా ? చూడు. ఈ కయ్యములో నేను ప్రతిపక్షవృత్తి (శత్రుభావంతో- ఱెక్కలు కదల్చినపుడెల్ల) నీ తలలను తాటిపండ్లవలె జలజల రాల్చివైతును. తలలెట్లు రక్షించుకొందువో విచారించుకో. ఇప్పటికయినా నా మాటవిని రాముని సతిని రథమునుండి దించి ప్రాణములు నిలుపుకొని పొమ్మ"ని జటాయువు రావణుని హెచ్చరించెను.

పతంగ కులీనుభార్య = సూర్యవంశస్థుఁడగు రాముని భార్య — సీత.

సీతను రక్షించుటకు జటాయువు చూపు నుత్సాహము వీర రసమునకు స్థాయిభావము. అందును ధర్మవీరము, యుద్ధవీరము రెండును మిశ్రితములై యున్నవి.

చనుమా - మనుమా - మనుజాళినాధమా - ఈ అంత్యానుప్రాసము శ్రావ్యముగా నున్నది.

50. పులినకటి, మీనలోచన,
సలిల భ్రమనాభి, చక్రసమకుచ, మాద్య
త్కల హంసగమన, వికస
న్నలినాస్య, వళీతరంగ, నదియైనదియో. (5-228)

రామలక్ష్మణులు సీతం గానక పలవించు ఘట్టము. సీతను క్రూర మృగములేమైన భక్షించినవో లేక ఆమె యేనదిలోనైన దుమికి మరణించెనేమో అని రాముడు కుందుచున్నాడు.

కటి [మొల] పులినతలము [ఇసుకతిన్నె] గా, లోచనములు [కన్నులు] మీనములు [చేపలు]గా, పొక్కిలి నీటిసుడిగా, స్తనములు చక్రవాకములుగా, మొగము తామరపూవుగా, వళులు [పొట్టముడుతలు] తరంగములుగా, నడక హంసచందముగా నా ప్రేయసి నదియైనదా లక్ష్మణా ! అని రాముఁడు విలపించినాఁడు.

స్త్రీకి నదీత్వము నారోపించినాఁడు. ఇందలి సావయవరూపకము మనోజ్ఞము. కవి సమయచమత్కారము హృదయంగమము.

51. అంగనాలలామ, గానవా, లతాకుడుంగ ! మా
తంగమా ! భుజంగమా ! పతంగమా ! కురంగమా !
లుంగమా ! లవంగ ! మాతులుంగ ! మాధవీనట
ద్భృంగమా ! వనీరమా ! కరీరమా ! సమీరమా ! [5-239]

"కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు" అని కవి కుల గురు కాళిదాస సూక్తి యిట సార్థకమైనది.

రాముఁడు సీతాన్వేషణమొనర్చుచు ఎందును ఆమెను గానక, కని పించిన చెట్టును పుట్టను పశుపక్ష్యాదులను—సీతను మీరు చూడలేదుగదా ! అని ఆమె జాడను వారినడుగుచున్నాడు.

అప్పకవి యీ పద్యమును కాకు స్వరవళికుదాహరణముగా నిచ్చెను.

52. అదె, లతాతన్వి, యొప్పు దలిర్చుకొప్పని,
పటు కలాపి, కలాప భరముఁజూచు,
నవె, తన్వి, తరళతరా పాంగరుచులని,
సారంగ, దృక్చకచ్చకలు చూచు
నవె, జవరాలి, మోహనపుఁ బాలిండ్లని
పరువడిఁ, గుంభికుంభములఁజూచు,
నదె, కోకిలాలాప, నసియాడు నడుమని,
యేనుంగు పగర, లేఁగౌనుఁజూచుఁ

జూచు, డగ్గరుఁ, గ్రమ్మఱఁజూచు, మరలుఁ,
బొరలుఁ, గెరలు, వియోగాగ్నిఁ నొగులు, నొగులు,
నెచటికేగితె ప్రాణేశ్వరీ ! యటంచుఁ
జీరువగఁ దారునారఘు వీరుడిటులు. [5-241]

సీతంగానక అరణ్యరోదన మొనర్చుచున్న ఆ రాముఁడు వనమృగ ములంగాంచి యిట్లు పలవరించుచు, భ్రాంతిపడుచున్నాడు. అదిగో సీత కబరీ బంధమని నెమలిపింఛము వైపు చూచును. అవిగో జానకి వాలుచూపు మెఱుగులని లేళ్ళ కన్నుల తళుకులను విలోకించును. అవే నా జవరాలి పాలిండ్లని మదపుటేన్గు కుంభస్థలములఁ జూచును. అదే నా సీత నడుమని మృగరాజు నడుమును బరికించును. ఇట్లు చూచుచు, సమీపించుచు, మరల పరిశీలించి చూచి కాదని వెనుకడుగువైచి, నిట్టూర్చుచు—ప్రాణేశ్వరీ ! ఎక్కడికేగినావని దుఃఖపడుచున్నాడు.

ఉపమానమును జూచి ఉపమేయమును స్మరించుటచే నిందు స్మృత్యలం కారము గలదు. మరియు రాముని భ్రాంతిగాన భ్రాంతి మదలంకారమును

గలదు. మరియు నుపమాలంకారమును ప్రతీయమానమగుచున్నది. సీతాదేవి అవయవ సౌందర్యము, రామునికామెయెడలగల ప్రేమాతిశయము, విరహాతి శయము నిందు ప్రస్ఫుటమగుచున్నవి.

వసుచరిత్రలో భట్టుమూర్తి వసురాజు విరహమును వర్ణించునపుడు

"కనుగొంటి, లత కూననని, డాయుఁ
గాకున్న, నభినవ తరలతావాప్తిఁ దెలుపు"

అను పద్యమిట్లేయున్నది.

53. ధారాశుద్ధిఁ బ్రసిద్ధిఁ గాంచి, ఘన శబ్దస్ఫూర్తి వర్తిల్లగాఁ,
దోరంబైన రస స్థితిన్, దరళ విద్యున్మాలికా లక్షణో
దారంబై, కవి సేవ్యమౌ, వనమయూరారా రూఢిఁ బ్రాపించి. వ
ర్షారంభంబు, ప్రబంధమట్లఖిల పద్యాక్రాంతమయ్యెందగన్ .
(6-13)

ఈ పద్యమున కవి వర్షారంభమును ప్రబంధముతో సరి పోల్చినాఁడు. వర్ష పరముగను ప్రబంధ పరముగను నయ్యలరాజు వాడిన శ్లిష్టోపమ గమనార్హము.

వర్షర్తువును వర్ణించుచు ప్రబంధమునకుఁ గావలసిన ముఖ్యాంశముల నిందు కవి పేర్కొనెను. వర్షాకాలమును ప్రబంధముతోఁ బోల్చిన కవి నైపుణ్యము పాఠకుల కచ్చెరువు గొల్పును. వర్షర్తు పరమైన యర్థము ప్రకృతము. ప్రబంధ పరమగు నర్థము అప్రకృతము. రెండర్థములును మనోజ్ఞములై హృదయంగమములుగానున్నవి.

వర్షమునకును ప్రబంధమునకును రెంటికిని ముఖ్యముగా కావలసినది ధారాశుద్ధి. రెండవది ఘనశబ్ద స్ఫూర్తి. వర్షార్థమున మేఘ ధ్వనియనియు, ప్రబంధార్థమున నుదాత్తమైన శబ్దస్థితి. వర్ష విషయమున జలము, ప్రబంధ పరమున రసము.

ఇఁక తరళ విద్యున్మాలికా లక్షణోదారము వర్షము. చలించు మెఱుపు తీగలతో నొప్పునది. మఱియు కవి సేవ్యమై వనమయూరగతి

వెలయుంచునది - అనగా జల పక్షులచే సేవింపఁబడుచు నెమలి ఆటతో కూడి యుండునది.

ప్రబంధము - తరళము, విద్యున్మాలిక, వనమయూరము - అను వృత్తములతో కూడియుండు నవకాశమున్నది. ఏవం విధప్రబంధము కవులచే సేవింపబడు నట్లు వర్షము చాతక పక్షులచే సేవింపబడునని భావము.

ఇట్టి వర్షారంభము ప్రబంధమువలె అఖిల పద్యాక్రాంత మైనది. ప్రబంధము అఖిల పద్యములచే నాక్రమింపబడును. "సరణిః పద్ధతిః పద్యా"- అని నిఘంటువు గనుక పద్యమునకు వర్షపరమున నిట మార్గము - అని యర్థముం జెప్పుకొనవలెను. అఖిల = అత్యంతము ఖిలమైన మార్గములు గల దయ్యెనని యర్థము.

ఇందు వర్ష వర్ణన విషయ మటుంచి కవి దృష్టిలో ప్రబంధమునకుఁ గావలసిన ముఖ్యాంశములు 1. ధారశుద్ధి 2. ఘనశబ్ద స్ఫూర్తి 3. తోరంపైన రసస్థితి యని గ్రహింపనగును. వర్షమున ధారా శుద్ధి ముందెట్లున్న దగినదో అట్లే కవిత్వమున ధారాశుద్ధి ప్రథమగణ్యమని కవి భావము. ధారాశుద్ధి నొక గుణముగా చెప్పుచు నరసభూపాలీయకారుఁడు "శ్రీనాథుని పద ప్రసిద్ధ ధారాశుద్ధి" నుటంకించెను. రామాభ్యుదయము లోని పద్యములన్ని యును ధారాశుద్ధి పూరితములై యుండుట యిందుకు నిదర్శనము. దానికి చక్కని శబ్దస్ఫురణ తోడ్పడవలెను. అర్థాతిశాయియగు శబ్ద సౌందర్యమును ప్రబంధకవులెల్లరు నారాధించిరి. అట్టి యుదాత్త శబ్ద స్ఫూర్తి ప్రబంధమున నుండవలెనని కవి భావము. అదియు నిందు గలదు.

కావ్య శరీరములగు నీ రెంటినీ పేర్కొనుటేగాక కావ్యాత్మయగు రసస్థితిని గూర్చి కూడ కవి చెప్పినాడు. ఈ పద్యమునఁ గవి శబ్దశక్తి మూల ధ్వనిని సాధించెను ఇట్లు కవి సాహిత్య విషయమున తనకుఁగల యభిప్రాయములను, కవితా సిద్ధాంతమును వర్ణనా వ్యాజమున వ్యక్త మొనర్చెను. శృంగార రస ప్రధాన కావ్యములు వుట్టు కాలమున వీర రస ప్రధానమగు రామాభ్యుదయ ప్రబంధము నతడు నిర్మించెను.

54. హరి హయాయుధ రేఖలన్గడల్ వేయించి
యలము ధారా రజ్జువుల బిగించి
జలదంబులను నీలి వలలెల్లడల నిల్పి
వివిధ, గర్జావాద్యరవము గొల్పి
తేవమీఅఁ, దటిన్నటే పంక్తిఁ బ్రేరించి
కోపుగా, మెఱుములు గొనగఁ జేసి
సరసులకోక, సొంపు సంధిల్ల గావించి
పెక్కు దిక్కులవారిఁ బెంపుఁజేసి

యలరెఁ, దొలకరి తటి పేరియాటవాఁడు,
మీటువాటిల్ల, వలరాచ మెచ్చువడసి,
పథికజన, మానధనము, లపారతిలఁ,
గొల్లలాడెను, భువనంబులుల్లసిల్ల. [6-18]

ఈ పద్యమున తొలకరిని దొమ్మరి ఆటతో సరిపోల్చిన కవి లోకజ్ఞత ప్రశంసార్హము. తొలకరి పరముగను దొమ్మరి ఆటపరముగను కవిచే నిందు శ్లిష్టోపమ కూర్పబడినది. శ్లేషనాశ్రయించియే కవి యీపద్యమున చమత్కారమును సాధించెను.

పల్లె పట్టులలో మొన్న మెన్నటివరకు కొందరు ఆటగాండ్రు తమ విద్యను ప్రదర్శించెడివారు. దానినే తెనుగునాట 'దొమ్మరాట' అందురు. ఆ దృశ్యము నిక్కడ అయ్యలరాజు కనులకుఁ గట్టినట్లు చిత్రించినాఁడు. తొలకరి దొమ్మరి ఆటగాడుగా కవికి కనిపించినాడు. అటగాడితోపాటు వానికి కావలసిన ఉపకరణములన్ని అతికినట్లు కవి వర్ణించెను.

ఇందు తొలకరి తటిపేరి యాటవాడు కర్త. అతడు తానాడించు దొమ్మరాటకు ఇంద్రధనుస్సులు అనుగడలు వేయించినాడు. అలముకొను నీటిధారలు—అను రజ్జువులతో ఆ గడలను బిగించినాడు. గడయెక్కి నాట్యము చేయువారు క్రిందపడినా దెబ్బలు తగలకుండా మేఘములు—అను నల్లని వలలను అంతటా నిల్పినాడు. మేఘములు గర్జించుట మూలముగా వాద్య రవములను గొల్పినాడు. అందము మీరునట్లు మెఱుపు తీగెలు—అను నటీ

పంక్తులను ప్రేరేపించినాఁడు. [దొమ్మరాటలో స్త్రీలు గడయెక్కి నాట్యము చేయుట ప్రసిద్ధము] వరుసగా ఉఱుములు అను శబ్దములు మ్రోగించెను. సరసులకొక సొంపు సంఘటించినాఁడు. సరసమైనవారికి ఆనందమును గూర్చె ననియు, సరస్సులను నింపెననియు నిట రెండర్థములు గ్రాహ్యములు.

పెక్కుదిక్కులవారి బెంపుచేసినాడు. అన్ని దిక్కులవారికి ఆనందమును గలిగించెననియు, అన్నిదిక్కుల నీటిని నింపెననియు రెండర్థములు. భువనము లుల్లసిల్లునట్లు అనగా లోకము లానందించునట్లు—నీళ్ళు ప్రకాశించునట్లు. ఇట్లొనర్చి వలరాజు [మన్మథుడు అను దొర] మెప్పుపొంది, ఆతడు పథికజన మానధనము లపారలీలఁ గొల్లలాడెనట. అనగా మార్గమందలి జనుల ధనమును అభిమానమును జూరగొనెనని ఆటగాని పరముగా నర్థము. తొలకరి పరముగా—పథికులన విరహులు. అట్టి విరహుల మానధనములను గొల్లలాడెనని, విరహులకీవర్షర్తువతి దుస్సహమనియు కవియిట శ్లేషలో వ్యక్తమొనర్చినాఁడు. ఇట్లు తొలకరిని దొమ్మరియాటతో బోల్చిన అయ్యలరాజు లోకపరిశీలనా పాటవమెంత యున్నతమైనదో యూహింపనగును.

55. చెదరి, దశకంధరోదీర్ణ జీవనంబు
పొలియు, నీచందమున నంచు, దెలుపు కరణి,
జీవనము బాసి, వెలవెల్లనై వసించె,
బంధురములైన, మేచక, కంధరములు. (6-33)

జనక తనయాన్వేషణ కనురోధకమైన వర్షాకాలమున సీతావియోగ వేదనచే రాముఁడు కృశించుచుండగా శరత్కాలమాసన్న మాయెను. అప్పట్టున శరదృతువు నైదు పద్యములలో కవి వర్ణించెను. వానిలో మొదటిదగు నీ పద్యమును కథాంశమునకుఁ బరిపోషకముగాఁ గూర్చి కవి భావి కథాసూచనమొనర్చినాఁడు.

వర్షర్తువున విజృంభించిన మేఘములు శరదృతువురాగనే పటాపంచలగును. ఈ యంశము నాధారముగాగొని కవి యిట్లూహించినాఁడు. ఇట కంధర, జీవన శబ్దములు శ్లిష్టములు. కంధర శబ్దమునకు కంఠమనియు

మేఘమనియు. నర్థములు. జీవన శబ్దమునకు బ్రతుకనియు, జలమనియు నర్థములు.

రావణుని గొప్ప జీవన మీవిధమున నే నశించునని తెల్పు విధమున, దట్టమైన నల్లని మేఘములు తమజీవనమును గోల్పోయి వెలవెలబారినవట. జీవనమనగా మేఘపరమున నీరు. మేఘముల జీవనమువలె రావణుని జీవనము గూడ తెల్లవారవచ్చినదని కవి యీ పద్యమున సూచించెను.

ఎంతటివారికిని ఎల్లకాల మొక్క రీతిని సాగదను విషయ మిందిమిడి యున్నది. వర్షాకాల మేఘములు శరదృతువున నశించును. వరగర్వమున విజృంభించిన రావణుఁడు కాల మాసన్నమైనపుడు తన ప్రాభవమును గోల్పోయి, నశించునను విషయమిందు సూచితమైనది.

ఈ పద్యమున కథాగమనమునకు జవము జీవముం గల్గించి, యుదాత్త భావముతో- నలంకార విలసనముతో- సందర్భానుకూలమైన వర్ణన మొప్పుచున్నది.

56. తనచూపంబుధి మీదఁ జూచి, శ్రవణ ద్వంద్వంబు రిక్కించి, వం
చిన చంచద్భుజముల్ సముత్కట కటీ సీమంబులన్
బూన్చి, తోఁ
కనభోవీధికిఁ బెంచి, యంఘ్రు విటియంగాఁ బెట్టి, బిట్టూది, గ్ర
క్కున నక్కొండయడంగఁ ద్రొక్కి, పయికిం గుప్పించి
లంఘించుచోన్. [6-93]

మహేంద్రగిరి నుండి సముద్రలంఘన మొనర్చు హనుమదాకృతి యీ పద్యమున కవిచే కనులకుఁ గట్టినట్లు మనోహరముగా వర్ణింపబడినది. బలశాలియగు వానరుడు లంఘించునప్పుడు ఏ విధముగానుండెనో యిందు స్వాభావికముగాఁ జిత్రింపఁ బడినది. ఇది యొక అద్భుతమైన భావన. మూర్తి చిత్రణమున స్థిరరూపమును వర్ణించుటకంటె చరరూపమును వర్ణించుట దుష్కరము. స్థిరరూప వర్ణనమునందును, చలద్రూప వర్ణనము నందును గూడ నయ్యలరాజు సిద్ధహస్తుఁడే.

57. గిరి కార్ముక నిర్గతమై,
హరి శర, మపుడసుర పుర, వరాభిముఖంబై,
సురగరుడ దురవలోక
త్వరతోఁ, జనె, నొక మహారవం బుదయింపన్. [6-95.]

ఈ పద్యమున కవి వాడిన శ్లేషానుప్రాణిత ధ్వని గమనార్హము. కొండ యనెడి వింటి నుండి వెల్వడిన కోఁతి యనెడి బాణము లంకాభిముఖముగా నేగెనని యొక యర్థము. ఇది రూపకము. రూపకాలంకార సౌందర్యమునంటుంచి రెండవయర్థము నూహింపనగును. త్రిపురాసుర సంహార మొనర్చునపు డీశ్వరునకు విల్లు మేరుపర్వతము. బాణము సాక్షాత్తు హరి. ఈశ్వరుని కార్ముకమగు మేరు పర్వతమునుండి బయల్వడిన నారాయణాస్త్రము రాక్షస పురాభిముఖముగా నేగెనని యిందలి శ్లేషార్థము.

నా డీశ్వరుడు నారాయణాస్త్రముచే త్రిపురములను భస్మ మొనర్చినాఁడు. అట్లే నేడు హనుమ లంకానగరమును భస్మ మొనర్చునని కవి యీ చిన్ని పద్యమున ధ్వనింపఁ జేసినాఁడు. ఇట్లు కావ్యాత్మయగు ధ్వనిని శ్లేషతో నను ప్రాణిత మొనర్చిన అయ్యలరాజు నేర్పు ప్రశంసార్హము. శ్లేషాలంకార మొక నర్తకివలె వివిధ భంగిమల యీతని కావ్యమున నాట్య మొనర్చినది. ఈ శ్లేషవిషయమున అయ్యలరాజునకు ఆంధ్ర వాఙ్మయమున విశిష్టస్థానము గలదు.

58. ఘూక కుటుంబినీ కోటిలో, నడిరేయి,
జక్కవ జవరాలు, చిక్కినట్లు,
జరఠ బిడాలికా జాలంబులోపలఁ,
జిలుక ముత్తైదువ, మెలఁగినట్లు
మత్త శిఖండినీ మాలిక లోపలఁ,
బాఁప కన్నియ, దగుల్వడిన యట్లు,
కితవ మృగాదన గృహిణీ గణంబున
లేడి యిల్లాలు మ్మలించినట్లు,

వేష భీషణ, దానవ వితతిలోనఁ,
దల్లడంబులఁ, బెదవులు దడుపుచున్న,
సాధ్వి, రఘువీర గేహినిఁ జక్కఁ జూచి,
యవునొ, కాదొ, కదా యని, యనిల సుతుఁడు. [6-130]

అశోకవనిలో సీతను హనుమంతుఁడు గాంచినపుడు ఆమె అవస్థాచిత్రణమును కవి కన్నులకుఁ గట్టినట్లుగా మనోహరముగాఁ జిత్రించినాఁడు. అశోకవనిలో రాక్షసస్త్రీల నడుమ భయపడుచున్న సీత దయనీయస్థితిని కవి యిందు వర్ణించెను. అపుడు, భయానక రసమునకు సీత ఆలంబనవిభావము. ఈ భయావస్థ ఆమె కరుణ రసావస్థకు బలమును గూర్చినది.

ఇందు కవి వాడిన ఉపమాలంకారము సీత యవస్థను బట్టియిచ్చుచున్నది. సీతకు వాడిన యుపమానములు అచ్చ తెనుఁగు సమాసములలో నున్నవి. 1. జక్కవ జవరాలు 2. చిలుక ముత్తైదువ 3. పాఁప కన్నియ 4. లేడి యిల్లాలు- క్రమశః వేయములగు చక్కని తెనుఁగు నుడికారములు. రాక్షసస్త్రీలకు వాడిన యుపమానములు సంస్కృత సమాస ఘటితములు. ఈషద్భయంకరమైనవి. జక్కవ, చిలుక మున్నగువానికి ప్రాణాంతకమైన శత్రువర్గములోనివి. 1. ఘూక కుటుంబినీ కోటి 2. జరఠబిడాలి కాజాలము 3. మత్త శిఖండినీమాలిక 4. కితవమృగాదన గృహిణీగణము.- ఈ యుపమానములనుబట్టి సీత రాక్షసస్త్రీల మధ్య నెంత భయవిహ్వలయై యున్నదో యూహింపనగును.

59. అన్నా : నీవు పులస్త్యవంశమణివై, యాఖండలాదుల్, బళీ,
యౌన్నత్యంబిదిరా, యనన్ బ్రతికి, నీవయ్యో ! యిదేమీ?
యవిచ్ఛిన్న ప్రాభవనాశహేతువు, పరస్త్రీ కాంక్ష చాలింపు, మిం
తన్నన్నేలినవాఁడు రాముఁడితరుల్ నాకుందనూ సంభవుల్.
(6-160)

రావణుఁడు అశోకవనిలో సీత కడకేతెంచి తన్ను అంగీకరింపుమని దురుక్తులాడినాఁడు. అంత సీతాదేవి వాని మాటలను తృణీకరించి వానికి నీతి బోధించుచున్నది. రావణుని వంశ గౌరవమును ప్రశంసించి, బ్రహ్మ

వంశమునఁ బుట్టి, యింద్రాదులచే భళీ యనిపించుకొన్న నీవు సర్వనాశ హేతుకమగు పర స్త్రీ కాంక్ష చాలింపుమని బోధించినది. తనభర్త రాముఁడని, యితరులు తనకు కుమారులని చెప్పినది. ఇట్లు చెప్పుటలో రావణుడను తన కుమారుఁడని, తాను జగన్మాతనను ధ్వని గలదు. పరస్త్రీ కాంక్ష పతన హేతువు - అను సందేశమును సీతచే రావణునకుఁ జెప్పించి, కవి లోకమునకు ఈ సందేశము నందించినాఁడు. ఈ పద్యమును కవి సులభ సుందరమైన సంవాద శైలిలోఁ గూర్చినాఁడు

60. ఉగ్ర ధనుర్విభేదనునకో మణిముద్రిక ! నీవు నేనుఁ బా
ణిగ్రహణం బొనర్చి, కరుణించుటకుం దగియున్న యున్కి, యు
వ్యగ్రమతిందలంచి, ప్రాణ సఖన్ననుఁ బాఅవైవ, క
త్యుగ్ర విపద్దశ న్నొగిలి యున్నదిగా, యని చూడవచ్చితే.

[6-182]

హనుమంతుఁడు సీతకు రాముని క్షేమముం దెల్పి, తాను రామదూతనని, ఆమెకు నమ్మకము పుట్టించుటకై రామునంగుళీయకము సీత కానవాలుగా నిచ్చినాఁడు. అపుడు సీతాదేవి పొందిన యానందమున కంతులేదు. ఆ ముద్దుటుంగరమునే శ్రీ రామునిగా భావించి, ఆమె భక్తితో పూజించినది. మరియు నిప్పట్టున సీత పొందిన శోకమును వివరించు తఱిని అయ్యలరాజు కరుణరస పోషణ సామర్థ్యము వ్యక్తమగుచున్నది. రామాంగుళీయకమును నందర్శించునపుడు సీత పొందిన శోకమును, ఆనందమును వర్ణించుచు కవి పదునాల్గు పద్యములు రచించినాఁడు. ఈ పద్యములన్నియును అణిముత్యములే. అయ్యలరాజు రామభద్రుని మహా కవి యనుటకీ పద్యములే చాలును. ఆ పద్యములన్నియు నుదాహరణ యోగ్యములే. వానిలో మొదటి పద్యము మాత్రమిటనీయఁబడినది. మిగిలిన పద్యములను గూడ సహృదయులు చదివి యానందింతురు గాక !

ప్రకృతము పై పద్యమున ఉంగరము తన్ను చూడవచ్చి నందుకు సీత తన కృతజ్ఞతను వెల్లడించుచున్నది. "ఓ మణి ముద్రికా ! శివ ధను

ర్భంగ మొనర్చిన రామునకు నీవును నేనును ఒక్కనాడే పాణిగ్రహణ మొనర్చి, ఆ స్వామి కటాక్షమును పొందియున్నాము. అది మనస్సున దుంచుకొని ప్రాణసఖి ఆపదలో నొచ్చియున్నది గదా ! యని నన్ను చూడ వచ్చినావా ? - అని ఉంగరముపై తనకు గల స్నేహ భావమును, ప్రీతిని వ్యక్త మొనర్చినది.

61. వారిమీద, వనధి వంచినంత ఫలము,
వారి వాడు తగుల వైచి చనిన,
మిగిలి కాలుచున్న, మీ మీ గృహంబుల,
చిచ్చులారు, నీరు చిలికి కొనిన. [7-58]

వానర సేనపై సముద్రము నెత్తి కుమ్మరింతుమని వీరాలాపము లాడు రాక్షసులతో విభీషణుఁడిట్లను చున్నాఁడు. వారివాడు అనగా హనుమంతుడు తగులబెట్టగా నింకను మిగిలి కాలుచున్న మీమీ యిండ్ల చిచ్చులార్పుకొనుఁడు. వారిమీద సముద్రము వంచినంత ఫలమని - విభీషణుఁడు రాక్షస వీరులను వెటకారము చేయుచున్నాఁడు. ఈ చమత్కారము సున్నితముగాను, కర్తవ్యమును బోధించునదిగా నున్నది. ఇట్టి చమత్కారములు చతురోక్తులు రామాభ్యుదయమున విరివిగానున్నవి.

62. పరుషోక్తి బాధ చూడకు,
పరిణామసుఖంబు చూడు, ప్రతికెద వసురే
శ్వర ! మందుచేదు చూడకు,
పెరిగిన తెవులడఁగ జూడు, పెద్ద తనానన్. (7-75)

విభీషణుఁడు రావణునకు హితముపదేశించుచున్నాడు. దుర్బోధ లొనర్చు రాక్షసులందరు నీకు హితులుగారనియు, యుద్ధమున వారందరు చచ్చి, నీచావునకు కారకులగుదురనియు విభీషణుడు రావణునకు చెప్పినాఁడు. సీతను రామునకు సమర్పించి, చేతులు జోడించి ఇల్లు నిల్పుకొనుమని, తన మాట పరుషముగానున్నదని బాధపడవద్దని—ముందు రాబోవు సుఖము నాలోచింపుమని చెప్పినాఁడు. మందుచేదు చూడక పెద్దతనాన పెరిగిన వ్యాధిని (పరస్త్రీ వ్యామోహము) మాన్పుకొమ్మని దృష్టాంతపూర్వకముగా

భోధించినాఁడు. "హితం మనోహారిచదుర్లభంవచః" అను భారవి మహాకవి వాక్యము స్ఫురణకు వచ్చునట్లు విభీషణునిచే రావణునకు కవి చక్కని యుపదేశమును జేయించినాఁడు.

63. తనదు ప్రాణేశ్వరికి, మహితనయకేడ
యావహిల్లునో, దురవస్థ, యనుచుగాక,
చులుకుఁ జూపుల, రఘుపతి జూచినపుడ,
లంకయాహుతిఁగొనఁడె నిశ్శంక మహిమ. (7-178)

సువేలాద్రి నెక్కి లంకంజూచిన శ్రీరాముని క్రోధమూర్తిని కవి యీ పద్యమున కమనీయముగా వర్ణించెను. తన ప్రాణేశ్వరియగు సీతలంకలోనున్నది గదా ! ఆమెకెచట దురవస్థ గల్గునోయని జంకెనుగాని చులుకు చూపులతో, జూచినపుడే రాముఁడు తనమహిమచే లంకనాహుతిగాఁ గొనడా ? అని కవి రాముని క్రోధమునుత్కృష్టముగాఁ జిత్రించినాఁడు. ఈ శంకయే లేనిచో తన చూపుచేతనే లంకను కాల్చగలశక్తి రామునిలోనున్నదని, ఫాలాక్షునకాతఁడు తుల్యుఁడని కవి యీ సందర్భమున రాము మహిమను ప్రశంసించినాఁడు. ఈ కవి గొప్ప భావుకుఁడు, ఈతని భావనాశక్తి అసాధారణమైనది.

64. నిను దన చంకవైచుకొని, నీరనిధాన చతుష్టయంబునన్
జని చని, సాంధ్యకృత్యములు సల్పెదునంతకుఁ ద్రిప్పితెచ్చి, పెం
పుననటవైచి, కొంకరలుపోయిన, నీమెయి చక్కనొక్కి, పో
ననిచిన, వాలిలందనుఁడ, నంగదుఁటన్, దశకంఠ ! వింటివే.
(7-258)

అంగద రాయబారఘట్టము. అంగదుఁడు రావణునితో నిట్లనుచున్నాఁడు. "ఇంతకును నీ వెవ్వడవని నన్ను ప్రశ్నింతువేమో ? నిన్ను చంకనిఱికించుకొని నాలుగు సముద్రములందుమునిగి సంధ్యాకృత్యములు ముగించుకొనినపిమ్మట నేలఁగూలవైచి, కొంకరలుపోయిన నీశరీరమును చక్కఁబెట్టి విడిచిన మహాబలశాలిని వాలిని మఱచిపోవుగదా ! ఆ వాలి కుమారుఁడనే నేను. నన్ను అంగదుఁడందురు. విన్నావా దశకంఠా" అని అంగదుడు

రావణునకు తన ఆభిజాత్యముం బ్రకటించెను. నా తండ్రిచే పరాభవమందిన నీకు నా చేతను పరాభవము తప్పదని, అంతటివాలిని గూల్చిన రాముని చేతిలో నీకు చావుతప్పదని—ధ్వని యిందుఁగలదు. రావణునకిదియొక హెచ్చరిక.

ఇట్లు సంవాదశైలిని ప్రసన్నధోరణిలో నడుపుచు నీకవి రచించిన పద్యములింకెన్నో గలవు. సంవాదశైలీ సందర్భములందు వైశద్యమవశ్య వాంఛనీయము. అట్టి వైశద్యము రామభద్రునకుఁగలదు. పాత్రల సంభాష ణములందు చైతన్యము తొణికిసలాడుచుండును.

65. అభ్రంకష, రథ, కపి చి
త్రభ్రమణంబుల, వెలింగె, ప్రళయాంతక, ఫా
ల భ్రాజిష్ణు, భ్రుకుటీ
విభ్రమ, ధౌరేయమైన, విల్లుందానున్. [8-129]

రావణుశక్తిచే లక్ష్మణుడు మూర్ఛపోయినపుడు రామునకు రావణుని పైవచ్చిన క్రోధ మప్రతిమానము. దుఃఖముతో తమ్మునివంక జూచుచు, కోపముతో రావణుంజూచుచు కన్నులెఱ్ఱజేసి యిట్లనినాఁడు. "రాక్షసాధమా! నీపాపము మితిమీరినది. బ్రహ్మాదులను శరణుజొచ్చినా విడువక నిన్ను వధించి తీరుదును" అని పల్కి రావణునితో యుద్ధమునకుఁ దలపడిన రాముని క్రోధ స్వరూపమును రౌద్ర రసానుకూలమైన పదప్రయోగమొనర్చి కవి యీ పద్యమున నద్భుతముగాఁ జిత్రించినాఁడు.

రాముఁడు హనుమద్వాహన మెక్కి రావణు నెదుర్కొన్నాఁడు. హనుమ తన శరీరమును మిక్కిలి పెంచి చుక్కలదాకా నిక్కినాఁడు. అంత యెత్తున హనుమంతుని మూపుపై నధిష్ఠించియున్న రామచంద్రుడు మింటి నొరయుచు హనుమ చిత్రభ్రమణములతో, ప్రళయకాలపు యముని నొసటి యందు కదలు కనుబొమ పోలుపు నింపు వింటితో ఎంతో అద్భుతముగా ప్రకాశించినాఁడు.

రాముని క్రోధ స్వరూపమును ఓజోగుణ ప్రధానమైన గౌడీ రీతిలోఁ గన్నులకుఁ గట్టినట్లుగా కవి చిత్రించినాఁడు. ఇట్లు తలపడి రాముఁడు రావణునితో నొనర్చిన యుద్ధమనన్వయము.

66. కలిత సుగ్రీవయై, కడుఁ బ్రబలస్తవహించి,
కుముదాప్త, ముఖ, వికాసమునఁ బోలివి
ప్రకట, రంభోరు వైభవమునఁ బాటిల్లి
కేసరి మధ్యయై, కీర్తఁ గాంచి
స్ఫురిత, లీలాంగద భూషితయై, మించి,
తగు, గజగామిని యగుచు, నలరి
ఘన, చక్రజఘన వైఖరిజాడ, రంజిల్లి
కార్ముక భ్రూభంగి, గరము మెఱసి

కం౦ఠె, దశకంఠ ! యలరు, నిక్ష్వాకు వంశ
నృపునిముందర, సాక్షాత్కరించు, విజయ
లక్ష్మియును బోలె, భువన కూలంకషోగ్ర,
విక్రమోదార, వానర వీరసేన. [7-193]

రావణప్రేరితులై వచ్చి చూచిన శుకసారణులను రాక్షసులు వెను దిరిగిపోయి రామసేనా విశేషములను రావణునకుఁ దెల్పుదురు. వానరసేన రామునిముందు సాక్షాత్కరించిన విజయలక్ష్మివలె నున్నదని ఆ శుకసారణులను చారులు రావణునికీ పద్యమునఁ జెప్పుచున్నారు. ఈ పద్యమున వానర సేనపరముగను, విజయలక్ష్మిపరముగను వాడిన శ్లిష్టోపమ అయ్యలరాజు శ్లేష కవితా నైపుణ్యమునకు జయపతాకమువలె నున్నది.

1. కలితసుగ్రీవ— సుగ్రీవునితోఁ గూడినది - వానరసేన
చక్కని కంఠము [మెడ] గలది - విజయలక్ష్మి.

2. కుముదాప్త ముఖవికాస— కుముదుడు ముఖభాగమున గల్గి వికసించునది. కుముద = కలువలకు ఆప్తుడు చంద్రుడు – చంద్రునివంటి ముఖముగలది.

3. రంభోరువైభవ— రంభుని గొప్ప వైభవముగలది - రంభ తొడలవంటి తొడల చక్కదనముగలది.

4. కేసరిమధ్య— కేసరి - అనువాడు మధ్య భాగమున గలది - సింహము నడుమువంటి నడుముగలది.

5. అంగదభూషిత— అంగదునిచేత అలంకరింపబడినది. భుజకీర్తులచే శోభించునది.

6. గజగామిని— గజునితో నడచునది. ఏనుగువలె నడచునది.

7. ఘన చక్ర జఘనవైఖరి— పెద్ద చక్రముల తీరైన గొప్పవిధము గలది. గొప్ప చక్రములవంటి పిరుదులుగలది.

8. కార్ముక భ్రూభంగివిరాజిత— విండ్లు కనుబొమ తీరుగా ప్రకాశించునది. విండ్లవంటి కనుబొమతీరుచే ఒప్పునది.

ఇట్టి వానరసేన విజయలక్ష్మివలె ఇక్ష్వాకువంశ ప్రభువునెదుట సాక్షాత్కరించుట కంటివా ? అని శుకసారణులు రావణునకు రాముని వానర సైన్య మహిమను వర్ణించి చెప్పినారు. ఇప్పట్టున నిట్టి శ్లేషసామాన్యులకు సాధ్యముకాదు. తన చారులు శత్రుస్తోత్రము చేసినందులకు రావణుఁడు వారిపై మండిపడినాఁడు.

రామాదుల పరాక్రమమును శుకసారణులు క్రింది రీతి ననేకవిధముల రావణు నెదుట ప్రశంసించినారు.

67. దృక్త్రితయంబు నంబోలుచు, దేవునకేని, నజేయుల వ్విభుల్,
వక్త్రియె, వాణియుం బొగడ, వారల దీప్తి, కపీంద్రులం జతు
ర్వక్త్రుడు నేర్పునే, భుజగవర్యువశంబె, గణింప, నింక, నీ
వక్త్రిమ పూర్వ సంచిత తపః ఫలమెట్లగునో దశాననా !
[7-188]

"దేవా ! ఆ ప్రభువులు ముక్కంటికైనను అజేయులు. వారి తేజమును వర్ణించుటకు వాణి కూడ చాలదు. చతుర్ముఖుడు చాలడు. మఱి మా వలన నేమగును ? నీ (పక్త్రిమ = పండిన) తపః ఫలమెట్లున్నదో అని రావణునితో నన్నారు. తరువాతి పద్యములో" పగదాయ చూడ్కికిన్ వేడుకగొల్పరే ! వినిన వీనుల విందులుగావె తత్కథల్" అని శత్రువుల చూపులకును వేడుకగొల్పు సుందరాకారులును, వారి కథలు శత్రువులకును వీనుల విందొనర్చుననియును ఆ భటులు రావణునకుఁ జెప్పినారు.

రామలక్ష్మణులు దృక్త్రితయంబునంబోలుచు దేవునకేనిన జేయులఁట. ఇందు కవి వాడిన దుష్కర ప్రాసము రామలక్ష్మణుల అమోఘ పరాక్రమమును జాటుచున్నది; మరియు నయ్యలరాజు పాండిత్య శౌండీర్యమును దెల్పుచున్నది ఇప్పట్టుననీతడు వ్రాసిన దుష్కర ప్రాసయుతను లగు మరి రెండు పద్యములను జిత్తగింపుడు.

68. హాస్త్య సురారి సత్కృత వరావధి యయ్యెనో ! కాక, వీరెనీ
వస్త్యము వంశమున్, జెఱుపవచ్చిన, వానర వీరు, లేల, పౌ
లస్త్య ! వృధా విరోధ, మకళంకనిలా సుత నిచ్చి, రాఘువో
పాస్త్య భిలాష పూని, నిరపాయసుఖస్థితి నుండఁ జెల్లదే.

[7-202]

69. స్వర్ఘంటా పథసీమ నిల్చి, యమరుల్, సంతోష మందన్, మహా
నిర్ఘాతోగ్ర, రఘూత్తమాస్త్రనిహతి, న్నీకేటికిన్ గీడ్వడన్,
దీర్ఘ క్రోధము మాని, మానిని, ధరిత్రీ పుత్రి, నిమ్మా. భవ
ద్దోర్ఘోరక్రమ, విక్రమంబులు, వృధాస్థూలంబులౌ, చెప్పితిన్

[7-203]

ఈ పద్యములయ్యలరాజు ప్రౌఢశైలికి నిదర్శనము. ఈతని పద్య రచనా సౌందర్యమునకును, సులభ శైలికిని శుకసారణులు రామలక్ష్మణులను ప్రశంసించిన రెండు, మూడు పద్యముల నుదాహరించి, ఈ కవితా వైభవ వ్యాసంగమును ముగింతును.

70. చిఱుత ప్రాయంబు వాఁడు పసిండి చాయ
మేనుగలవాఁడు, విలుకాండ్ర మేటివాఁడు,
వీర రస మిట్టి రూపమై వెలయు వాఁడు.
రాము తమ్ముఁడయా, వాఁడు. రాక్షసేంద్ర ! [7-200]

71. ఇందు శతంబునేలు మొగ, మిఘుశరాసనకోటి నీనుచ
క్కందమున్ దనర్చు తొలుకారుమొగుల్ జిగిమేనివాఁడు, లం
కం దెరలించు మాడ్కిఁ, గనుకం, దనుజాన్వయ మొక్కగ్రుక్కఁ మ్రిం
గందమకించు మించు విలుకాఁడల రాముఁడు, చూడు.
రావణా ! [7-198]

72. మునుగా చెంగ్రతు, వంఘ్రి ధూళి శిలఁగంబుగ్రీవఁ గావించె, శం
భునివిల్ ద్రుంచె వరించెసీత. భృగు రాముంగెల్చె గూల్చెన్
ఖరున్ !
దునిమెన్ మాయ మెకంబు, నేలె రవిపుత్రున్. వాలిఁ దూలించె.
వ్వనధిం గట్టె ! విభీషణున్ నిలిపె, నిక్ష్వాకుండు సామాన్యుఁడే ?
[7-198]

---

• చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది •





# యువభారతి
## మీ అభిప్రాయాల్ని
## ఆహ్వానిస్తున్నది

యువభారతి 'లహరి' ఉపన్యాస కార్యక్రమాలు-ప్రచురణలు 'నందిని' గూర్చి జనాభిప్రాయాల్ని సేకరించాలని మా సంకల్పం. క్రింది విషయాలపై విలువైన మీ సూచనలు తెలిపితే సంస్థ భవిష్యత్కార్యకలాపాలు తీర్చిదిద్దే ప్రయత్నంలో తాము సహకరించిన వారౌతారు.

* ఈ పుస్తకం చదివారుకదా! మీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా వెంటనే మాకు తెలిపి - మా కృషిని ప్రోత్సహించండి.

* మా నందిని పత్రిక చూశారా? బాగా నచ్చిన లేక నచ్చని శీర్షికలేవి? ఎందుచేత? ఇంకా ఏయే శీర్షికలు ప్రవేశపెడితే బాగుంటుంది? 'నందిని'ని అత్యుత్తమ సాహితీ పత్రికగా తీర్చిదిద్దేందుకు మీ సలహాలు, సూచనలేమిటి?

* యువభారతి నిర్వహిస్తున్న 'లహరి' ఉపన్యాస కార్యక్రమాలతో మీ రెప్పుడైనా పాల్గొన్నారా? మీ అభిప్రాయమేమిటి? భవిష్యత్తులో 'లహరి' ఉపన్యాస కార్యక్రమాలు ఎలావుంటే బాగుంటాయని మీరనుకుంటున్నారు?

* యువభారతి ప్రచురణల్లో కొన్నింటినైనా మీరు చదివారా? మీకు నచ్చిన లేక నచ్చని ప్రచురణలేవి? ఇంకా ఎలాంటివి ప్రచురిస్తే బాగుంటుంది?

* సంస్థ పథకాలు 'సాహితీమిత్ర' 'భారతీమిత్ర', 'భారతీ భూషణ'లలో మీరు సభ్యులా? సంస్థ ప్రచురణలు మీకు అందుతున్నాయా?

యువభారతి ప్రచురణలను మీ మిత్రులకు పరిచయం చేయండి యువభారతి. ప్రచురణలను మీరు బహుమానాలుగా ఇవ్వండి. మీకు పరిచయమున్న పాఠశాలలచే కొనిపించండి. మీ పరపతిని వినియోగించి "నందిని"లో వ్యాపార ప్రకటనలు ఇప్పించండి.

చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకన్న ప్రయత్నించి చిన్న దీపాన్నయినా వెలిగించాలనేదే యువభారతి ధ్యేయం.

దూరప్రాంతాల మిత్రులు హైదరాబాదు వచ్చినప్పుడు తిలక్ రోడ్ లోని ఆంధ్ర సారస్వత పరిషత్ భవనంలోని మన కార్యాలయానికి విచ్చేయండని ఆహ్వానిస్తున్నాం.

మీ సహకారాన్ని అర్థిస్తూ

యువభారతి




# యువభారతి
## సాహితీమిత్ర పథకం

యువభారతి తన కృషిలో పాలు పంచుకొనే మిత్రుల కోసం ఎదురుచూస్తున్నది. సాహితీ మిత్రులుగా చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకొనే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. యువభారతితో సర్వదా సాహితీబాంధవ్యాన్ని పటిష్టం చేసుకోవాలనేదే సాహితీమిత్ర పథకధ్యేయం.

కేవలం రూ. 10/- లతోనే సాహితీ మిత్రులుగా చేరండి.

మీ సాహితీ స్నేహాన్ని అందించండి.

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3